# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

### సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 | రాజమహేంద్రవరము 1-8-1980 | సంచికలు 18, 19


## —* ఈ సంచికలో *—



16—8—1980 సంచికలో ఋతుఘోష, వేదశాస్త్ర పరిషత్తువారికి పిడపర్తి సిద్ధాంతి సోదరుల వాస్తవ కథనము, ఊతపదాలు వైశిష్ట్యము,ఆముక్తమాల్యద ఋతువర్ణన, ప్రభోద చంద్రోదయం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా :
సంవత్సరమునకు రు. 10—00.
అర్ధసంవత్సరమునకు రు. 5—50.

ఈ ప్రతి 50 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundr

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-8-1980 సంచికలు 18 19

# ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకు

— శ్రీ ని. వి. శర్మ, ఎం. ఏ

'అల్లసానివాని అల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు
పాండురంగ విభుని పదగుంభనంబును
కాకమానురాయ నీక తగుర'

ఇది చిరకాలమునుండి ఆంధ్ర సాహిత్యమున వినబడుచున్న చాటువు. దీని పుట్టుపూర్వోత్తరములు తెలియకున్నను కాకమానిరాయడు ఇతివృత్త నిర్వహణలో పెద్దనకు, ముద్దుగా కవిత్వము చెప్పుటలో నందితిమ్మనకు, పదప్రయోగ విషయమున పాండురంగ విభునకు సాటి వాడని తెలియుచున్నది.

ముక్కు తిమ్మన అసలుపేరు నంది తిమ్మన. రాయల కొలువులో తిమ్మన నామధారులు ముగ్గురు. తిమ్మరుసు, వాకిటి కావలి తిమ్మన, తిమ్మకవి. మిగిలిన ఇద్దరి నుండి తిమ్మకవిని పృథక్కరించుటకై పెద్దముక్కుగల తిమ్మనను జనులు ముక్కు తిమ్మన యని వ్యవహరించి యుందు రని కొందరు విమర్శకుల యూహ.

కృతిపతి పలుకులు, ఆశ్వాసాద్యంత పద్యగద్యలు కవి తన కవిత్వ లక్షణాదులను చూపుతావులు. తిమ్మన స్వయముగా రచించి కృతి నర్పించుటచే పారిజాతాపహరణ గ్రంథమున కృతిపతి పలుకులు లేవు. పంచమాశ్వాసమునందలి

సీ॥ కౌశికగోత్ర విఖ్యాతుఁ డాప స్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్రకులుఁడు'
(108)

అను పద్యము తిమ్మన గోత్ర నామములను తల్లిదండ్రులను, మేనమామ యగు మలయమారుతకవిని తెలుపుచున్నది. తిమ్మనకు సుజన విధేయుఁడు, సకల విద్యా వివేక చతురుఁడు, శివపరాధీనమతి యను విశేషణములు కనబడుచున్నవి.

ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకు అను పరికించుట ఈ వ్యాసోద్దేశము. ముద్దు అనుపదమునకు చుంబనము, ముద్ర మొదలగు అర్థములేకాక మనోజ్ఞత, మనోజ్ఞము అను అర్థములుకూడ ఉన్నవి కదా! అపుడు తిమ్మన పలుకు మనోజ్ఞముగా నుండు నని యర్థమువచ్చును. తిమ్మన సరస్వతీ స్తుతి చేయుచు ఆమె పలుకుల కిడిన 'మృదుగీతికా పరిణతి ధ్వని వైఖరి (1-5)' అను విశేషణమును తిమ్మనపలుకునకు కూడ విశేషణముగ భావించినచో తిమ్మనపలుకు మనోజ్ఞముగా నుండుటకు కారణం విదమగును. అపుడు తిమ్మన కవిత్వము మనోజ్ఞముగా చెప్పగలడని లేదా తిమ్మన కవిత్వము మనోజ్ఞముగా నుండు నను అర్థము వచ్చుచున్నది.

'వలిమల యల్లువాఁడు దల
వాఁక ధరించిన పూవుగుత్తి, వే
ల్పులగమి జీవగఱ్ఱ, యుడి
వోవని చల్వల టెంకి, వెన్నెల
ల్మొలచినపాదు, పాల్కడలి
'ముద్దులపట్టి' నృసింహ కృష్ణ రా
యలఁ గరుణారసంబు నిను
పారెడి చూపులఁ జూచుఁ
గావుతన్.' 1-6

ఇది చంద్రస్తుతి. కృష్ణరాయలు చంద్రవంశము వాడగుటచే తిమ్మన చేసియుండు నని స్థూలముగ తోచును. చంద్రునకు శృంగార రసమునకు గల సంబంధముచే పారిజాతాపహరణము శృంగార రస ప్రధానమైనదిగా తెలియుచున్నది. 'పూవు గుత్తి' అనుపదము పారిజాతమును స్ఫురింపచేయుచున్నది. చంద్రుని 'పాల్కడలి ముద్దులపట్టి' అనెను. చంద్రుడు పాల సముద్రమునుండి పుట్టెను. ఆహ్లాదకరుడు. వలిమల యల్లునివాని 'తలవాఁక పూవుగుత్తి'గా చేరెను. అట్లే మృదుగీతికా పరిణత ధ్వని వైఖరితో ముద్దుగానుండు త[illegible] కావ్యకుసుమము సహృదయ జనాహ్లాదకరమై సాహిత్య సరస్వతి కొప్పు

వాడనిపూవై యుండునని తిమ్మన అభిప్రాయము.

'పాలతుల్ కౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి
తలఁ బ్రా
ల్పోయించు నవ్వేళ నాఁ
డల గంగం దననీడఁ దానకని మా
ర్యంబొప్ప వేఱొక్క తొ
య్యాలి యంచు న్మది నెంచుపార్వతియనూ
యావాప్తి కిన్నవ్వు క్రొ
న్నెలపూదాలుపు కృష్ణరాయనికి సం
ధించు న్మహైశ్వర్యముల్' (1-2)

తిమ్మన ఈశ్వరస్తుతి చేయుటకు కారణము శివపరాధీనమతి యగుటయే కాక వేరొకటి తోచుచున్నది.

'గుణదోషౌ బుధో గృహ్ణ
న్నిందుక్ష్వేలా విశేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం
కంఠే నియచ్ఛతి.'
—కవిరాక్షసీయము

కవి రాక్షసుడు బుధులను ఈశ్వరునితో పోల్చెను. గ్రంథమునందలి (గుణ దోషములను గ్రహించి) గుణములను శిరసా శ్లాఘించి దోషములను గూర్చి ప్రస్తుతింపవల దని కోరుచున్నాడు. ప్రబంధ ప్రక్రియలో పారిజాతాపహరణము ఆద్యమగుటచే ఇందు గుణములతోపాటు దోషము లుండవచ్చును. శివుడు విషమును కంఠమునందు ధరించి నటులు బుధులు దోషములను ధరింతురనియు, గుణములనుశిరసా శ్లాఘింతురనియు ఊహింప వచ్చును. 'వలిమలయల్లువాడు' అను పద్యమున ప్రస్తుతింపబడిన చంద్రుడు కావ్యపరముగ గుణములకు ప్రతీకగ నుండుటచే చంద్రునకు గల 'ముద్దు'అను విశేషణము తిమ్మన కవితా గుణములకు వర్తించు నట్టిదిగా కూడ ఉన్నది.

దీనిని బట్టి 'ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకు' అను ఆ భాణకము వచ్చియుండును.

'పాలతుల్ కౌఁగిట గ్రుచ్చి' పద్యమున సపత్నీమాత్సర్యము వర్ణింపబడినది. ఇది పారిజాతాపహరణమునకు ప్రధానకారణమైన సత్యాదేవి యసూయను సూచించుచు ధ్వనిగర్భితమై కావ్యమనోజ్ఞతకు శిరోరత్నముగ భాసిల్లుచున్నది.

ఇతివృత్తయెన్నికలోను, తన్నిర్వహణలోను ముద్దుతనము కనబడుచున్నది. నరకాసుర సంహారానంతరము కృష్ణుడు ద్వారకా నగరమున సుఖాబ్ధిలో నోలలాడుచుండును. ఒకరోజు కృష్ణుడు రుక్మిణి యింటనుండ నారదుడు వచ్చి పారిజాత కుసుమము నిచ్చును. కృష్ణుడు దానిని రుక్మిణి కిచ్చును. అది చెలిద్వారా తెలిసి సత్య కోపము చెందును. కృష్ణుడు ఆమె ననునయించును. ఆమె కోరికపై పారిజాత వృక్షమునే నాక లోకమునుండి తెచ్చి సత్య గృహారామమున ప్రతిష్ఠించును. తరువాత నారదుని సలహాపై సత్య పుణ్యకవ్రతము నాచరించును. నారదుడు చిత్రగతుల కృష్ణుని స్తుతించి వెళ్లును. తిమ్మన హరివంశమునందలి సంక్షిప్తకథను తీసికొని ప్రబంధానుగుణముగా వర్ణనాదులను చేర్చి రసవత్తరముగా తీర్చిదిద్దెను. పురాణమునందలి ఆ ప్రసిద్ధేతిహాసమును తీసికొని రసపాత్రపోషణ వర్ణనాదులతో విస్తృతపరచి, స్వతంత్ర గ్రంథమా అన్నట్లు చేయుట ప్రబంధకవి లక్షణము కదా।

పాత్రపోషణ కవిప్రజ్ఞకు గీటురాయి. కవిచే సృష్టించబడిన స్త్రీ పురుషాది హావభావాలను చక్కగ చిత్రించుట పాత్రపోషణ అనవచ్చును. స్వాభావికతకు దగ్గరగానుండి, సహృదయులకు ఆనందశోకాదులను కలిగించిన పాత్రలను సజీవ పాత్రలు అనవచ్చును. ఎప్పటి సమాజమును పరిశీలించినను ఆ పాత్రలను బోలినవారు మనకు కన్పింతురు. తిమ్మన ఈ గ్రంథమున సత్యభామను మనోహరముగ చిత్రించెను. సత్యభామ అనగానే పాఠకునకు ముక్కుతిమ్మనార్యుని సత్యయే స్మృతికివచ్చును. కృష్ణునియందు మక్కువ ఎక్కువ. కృష్ణుడు అష్టమహిషులలో తనను అధికముగా గౌరవించునని యామె నమ్మకము. అపశకునము కలిగినచో కృష్ణుడు ఏ సవతికడనో తక్కువచేసి భాషణాదులు సల్పియుండునని యామె నమ్మిక. ఆమెకు ఏమాత్రము అవమానము తక్కువదనము కలిగినను సహించలేదు. చెలికత్తె ద్వారా పారిజాత వృత్తాంతమువిని ప్రేటువడ్డ యురగాంగనవలె, నేయివోయ దరికొన్న హుతాశనకీల యనంగ, లేచినది. 'ఇన్నిదినంబులున్ సవతులిందఱలోపల గారవంబునన్ వల్లభుడు కన్నులఁ గప్పకొనంగ నుండి యావన్నెయు వాసియుం దొలగి వారు నన్నుం దలయెత్తి చూడఁగా సన్నల జాయలం బలుకనైతు నె' అని చెలికత్తెతో వాపోయినది. ముని తనను తక్కువచేసి మాట్లాడునపుడు అడ్డగించలేదని కృష్ణునిపై కోపము. కోపమున ఎవరినైనను ఎంత మాటయినను అనగలదు. 'పసుల కాపరి భావజ మర్మకర్మము లెట్లు ఎరుగు'నని ప్రశ్నించింది. కృష్ణుడు తనవాడని నమ్మకము కలిగితే చాలు పొంగిపోతుంది. తన కనుసన్నలలో తిరుగువాడుగ తన విధేయుడుగ భావిస్తుంది. 'ఏమో వచియింపబూను హృదయేశ్వరునింగను సంజ్ఞ మాన్చి (4-58)'

'వినుడు! సురేశ్వరు వనపాలకులు! వార్ధిఁ
బొడమిన యీదివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుండు
నెవ్వఁడు?
పలుకు లేటికిఁ, దాపీరపత్ని యేని
మీశచీదేవి తనదు ప్రాణేశుడైన
మఘవు నిట, బంపి సత్యభామా విధేయు
వలన మరలంగఁ గొనుటె పో!
వానితనము' 4 59.

అని స్వర్గలోకమున వనపాలకులతో సత్య పలుకు సందర్భమున ఈ విషయము స్పష్టముగా తెలియును.

ప్రబంధములకు వర్ణనలు ప్రధానము. కావ్యములనుండి వర్ణన, కస్తైక్యము

మొదలగు కారణములవలన ప్రబంధములు పృథక్కరింప బడిన వనవచ్చును.

'వనిత కుచద్వయంబుపయి
  వ్రాసిన కుంకుమ పత్రభంగముల్
జనిత నితాంత ఘర్మకణ
  జాలముచేతఁ గరంగి మెల్ల మె
ల్లన వెలిపట్టు పయ్యెద కె
  లంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరస
  మున్వెడఁ బెట్టుచునున్న కైవడిన్'
1-113

అని కృష్ణుడు అనునయించ బోవు సత్యను వర్ణించునట్టి పద్యమిది. చందోయి పయి వ్రాసిన కుంకుమపత్రములు కరిగి వెలిపట్టు పయ్యెద కెలంకుల జాఱుట మనసులోని క్రోధరసమును వెడపెట్టున ట్లున్నదట. అట్లే ద్వితీయాశ్వాసమున సూర్యాస్తమయమును

'ఒక భృంగంబు పరాళినీ మదన తం
  త్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవ మత్త నబ్జ గృహా సీ
  మం బెట్టి తాఁ బోయి సం
జకడ న్వచ్చి తదానన స్మృతుల మే
  జాడం జొరన్రాక, యా
మికుఁడో నా, దిరిగెంఁ గొలంకు రమకున్
  మేలెంత హీనం బొకో'     (2-93)

అని వర్ణించెను. సంధ్యా సమయమున పద్మము ముకుళించును. మకరందమును ఆస్వాదించుట అసాధ్యమగుటచే తుమ్మెద పద్మము చుట్టు తిరుగును. తిమ్మన దీనిని చక్కగ ఉత్ప్రేక్షించెను. అట్లే సత్యభామ స్వర్గమునకు వెళ్లునపుడు

అంబుధర జాలముక్తంబు లయిన జలకణములు సాత్రాజితీ కైశికముఁ బోలి చె
గగన తల లక్ష్మి పోరచిగాఁగ నిడినఁ
జాల నొప్పారు మౌక్తిక స్తబకమనగ'
(1-79)

ఆమె తలమీద పడిన నీటి బిందువులను మనోహరముగా వర్ణించెను.

# శ్రీ శ్రీ కవిత - అధివాస్తవికత

— శ్రీ కలవరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

'కొంకెకోణాలు' అధివాస్తవికతకు లక్షణప్రాయంగా సాగిన రచన.

  'జీబ్రాకి algebra చిహ్నాల
  లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
  సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
  వెర్రికాదు surrealism రా సోదరా'

అని సర్రియలిజాన్ని నిర్వచించినాడు ఈ గేయంలో. దీన్లో జీబ్రా జంతువు. ఆల్జీబ్రా బీజగణితం. ఈ రెంటిలో జీబ్రా శబ్దసామ్యంతప్ప విశేషం లేదు. రెండూ సంబంధంలేనివి. జీబ్రాకు ఆల్జీబ్రా చిహ్నాల లాంకోటు తొడిగి పాంకోళ్ళు వేయుట అసంబద్ధము. అర్థరహితము. దానికి సాహిత్యపౌరోహిత్యం ఇవ్వటం విచిత్రం. కాగా వీరిదృష్టిలో సర్రియలిజమ్ 'అసంబద్ధము, అర్థరహితము' అగు కవిత అని తెలియుచున్నది. ఈ గేయమంతా ఇదేరీతిలో సాగినది.

  'ఢంకో బంకోబస్తు లన్నీ
  ఫట్! ఫట్ ఫట్ మని త్రెంచి
  Damn it! ఏమిట్రా? ఇదంటే
  Pray! It's Poetry  అందాం.'-

అంటాడు. దీనిద్వారా అధివాస్తవిక కవిత ప్రధానలక్షణ మగు నియమరాహిత్యం, విశృంఖలత్వం సూచిస్తున్నాడు. 'Down with syllogisms, colaries Q.E.D cause and effect; the whole and the sum of its parts, open the gates to dream, make room for 'automatism' We are about to see a man as he is, we shall be whole men.' unchained delivered, daring at last to be aware of desires and daring to ful fill them' అన్న పలుకులు ముఖ్యంగా చివరి వాక్యములు ఈ సందర్భంలో గమనార్హాలు. 7

'అర్థాన్ని అధ్యాన్నపు అడవిలో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేద్దాం
కాదన్న మాదన్న యెవడన్నా ఉంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం'

అధివాస్తవిక కవితలో అర్థానికిగల అప్రాధాన్యాన్ని సూచించాడిందులో. 'యథార్థాన్ని గుర్తించము. కలలు మాకు యథార్థాలు. ఈజగత్తుతో మాకు పని లేదు. మాదస్వప్నజగత్తు. సంపన్నులం భాషాసంపన్నులం మాకు విరోధులం. కావ్యలక్షణాలే అవలక్షణాలు. అందరం కవులమే. వ్యక్తాన్ని వదలి పెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈత కొడతాము. ఏదోవిధమైనశక్తి మమ్మల్ని పూనుతుంది అదేదో రాయిస్తుంది 'అర్థమనర్థం.' అదేది రాయిస్తే అదే కవిత్వం. ఇది అధివాస్తవికుల మతం' 1 అంటాడు శ్రీశ్రీతోపాటే అధివాస్తవిక రచనలు చేసిన శ్రీరంగం నారాయణబాబు. పై పంక్తుల్లో 'వేమన్న యేమన్నాడో చూడమనుట' అధివాస్తవిక కవిత ప్రధాన లక్షణమగు అధిక్షేపము స్ఫురింప చేస్తున్నాడు. వేమన సమాజంలోని అవకతవకల్ని సర్వవిషయాల్ని తన కవితావస్తువులుగా చేసికొని నేటి సమాజంపై ధ్వజమెత్తిన ప్రజాకవి. ఇట్లే అధివాస్తవిక కవితలోగూడ అధిక్షేపము ఒక

మొత్తముపై ముక్కు తిమ్మన పారిజాతాపహరణము రసనిర్భరమై, సుకుమారశయ్యా శోభితమై మృదుపదగతమై తాను గావించిన సరస్వతీ ప్రార్థనాపద్యములోని విశేషణములకు సాకార స్వరూపమువలె శృంగార సరస్వతివలె ఒప్పారుచున్నది.

— ... —

భాగం. వీనితర్వాత పంక్తుల్లో 'న...న న...న...న త్తిమాటలు కూడా, మ... మ...మ...మన వ్రాతల్లో ఉండొచ్చు' నంటాడు. దీని కుదాహరణ పంక్తులివి.

'కటకటా ! లొటిపిటా చస్తే
కృ.శా. విషాదకావ్యం వ్రాయాలా ?
sex లో X కర్థంతీస్తూ
చలం కలం పట్టుకోవాలా ?'

ఇందులో శాబ్దిక చమత్కారం కన్పట్టుతోంది. ప్రథమపాదంలో టకారావృత్తి. ఈపౌనఃపున్యంతో ఒకవిధమైన సౌందర్యం కల్పించాడు. కృష్ణశాస్త్రి విప్రలంభ శృంగారవర్ణనతో విషాదగీతాలాలపించారు. కాని లొటిపిట మరణానికి sex X ; చలం - కలం ఇవి శబ్దచిత్రాలే.

'De compositions' లో ఈపంక్తులు స్రియలిజానికి చక్కని ఉదాహరణ.

'కాకికేమి తెలుసు Psycho analysis
ఆటవెలది ద్విపద కర్తగారు
5, 3, 2 ఆముక్తమాల్యద
విశ్వదాభిరామ వినురవేమ.

(పాఠాంతరం. దీనిభావ మేమి తిరుమలేశ.) కాకికి - సైకో, తెలుసు - ఎనాలిసిస్ అక్షరపునరావృత్తితో ఒక సౌందర్యం ఏర్పడింది. 'సైకోఎనాలిసిస్' ఫ్రాయిడ్ సిద్ధాంతానికి ప్రాతిపదిక. కాకికి, దానికి సంబధం శూన్యం. ఆటవెలది, ద్విపద కర్తగారనుట (సంప్రదాయకవితా) ఛందస్సుపై అవహేళన. 5, 3, 2 కి ఆముక్తమాల్యదకు గల సంబంధము వ్యంగ్యము. చివరశతక మకుటము. దానికొక పాఠాంతరము. ఇంతటి అర్థరహితము, విశృంఖలమునగు కవిత స్రియలిజమ్.

'అధివాస్తవికుల ప్రవేశం' సంప్రదాయ ఛందస్సులో చేసిన అధివాస్తవికరచన. ఈ ఖండికలో మొత్తం తొమ్మిదిపద్యాలు కలవు. అందొకటి.

'భ్రమింగితి మింగలాంగల తే
మిస్రగుహాంతర మీనమేష పా
రంగతులైన బొంగరము
లార రొయిరింగిన తెల్పుడా పరి
ష్వంగము పాడు టెంగుకు ? వి
పంచికి కంచికి దూరమెంత ? వ
ద్రంగుల రంగులా గులక
రాళ్ళగు మాగుడిలోని లింగముల్ ?'

-ఇందు అర్థాన్ని వెతకటం అవివేకమే. అది అధ్వాన్నపుటడవిలో వదలి వేయబడింది. ప్రాచీన చ్ఛందస్సులపై. సామాసిక రచనా విధానంపై ధ్వజమెత్తిన రచన యిది.

కాగా శ్రీశ్రీ అధివాస్తవిక రచనల్లో 'అభిసారిక కడసారి' మకుటాయమానం. ఇది విశిష్టము, విలక్షణము నగు గేయం. ఫ్రాయిడ్ సిద్ధాంతప్రాబల్యంతో వ్రాసిన గేయమిది. ఇందలి వస్తువు సిఫిలిస్ (సుఖవ్యాధి) కి సంబంధించినది. ఒకానొక సుఖవ్యాధి పీడితయగు వేశ్య కడకు లైంగిక సంతృప్తికై వెళ్ళు వాని శోకనిని వారించునది.

'ఆకాశం మీద రాకాసి కోర
ఏడకయ్యా పోతావు
కోరచుట్టూ నెత్తుటిచుక్కలు
ఏడకయ్యా పోతావు'

అంటూ ప్రారంభమయ్యే ఈ గేయం ప్రతీకాత్మకము. అనంతర పంక్తుల్లో భయంకరవ్యాధిగ్రస్తయగు స్త్రీ మర్మాంగ వర్ణన కన్పడుతోంది.

'కనుమలోనిది కొ_కొ_కొ కొలిమి
వెళ్ళకయ్యా చెడతావు
నీడ మూడకు నీకే హాని
సంకేతం నీ శ్మశానం'

తమ కవితల్లో 'న_న_న_ నత్తిమాటలు ఉండవచ్చు'నన్న దానికి ఉదాహరణ ఈ గేయంలోనే కన్పట్టుతోంది_ కొ...కొ కొ...కొలిమి అనుటలో.

ఏమిటీ దంతపు చర్మంమీద
ఎఱ్ఱని పచ్చని దేదో మచ్చ
లోతులోయలో భూతాలు
కొలిమినిప్పులో గుర్రాలు
సూదికి కంట్లో సోపానం
కాళ్ళకి కళ్ళు సంకెళ్ళు
సంకేతం నీ సాల్వర్సాన్
జలపాతంలో జంఝూటి'

అని ముగిసే ఈ గేయంలో 'ఆకాశంమీద రాకాసికోర, కోరచుట్టూ నెత్తుటి చుక్కలు, కనుమలోనిది కొలిమి, సంకేతం నాసరస్సు, సంకేతం నీశ్మశానం, దంతపు చర్మంమీద ఎఱ్ఱని పచ్చని దేదోమచ్చ' ఇత్యాదులన్నీ ఫ్రాయిడ్ సిద్ధాంతానికి ప్రబల తార్కాణాలు. కృత్రిమత్వానకు లోనుగాక, నియమ నిబంధనలు, ఆచార సంప్రదాయములు త్రోసిరాజని జీవిత గవాక్షం నుండి వీక్షించిన బయల్పడు ఇట్టి అనేక విషయాల్ని అధివాస్తవికులు కవితా రూపమున పెట్టుటకు ప్రయత్నించారు. ఈ గేయంలో వాడినట్టి లైంగిక ప్రతీకలు, అశ్లీలపదాలు నేటికి, తెలుగుసాహిత్యంలో అంధానుకరణగా మిగిలిపోయిన భావకవితా జడత్వాన్ని వదలకొట్టటానికి ప్రయోగింపబడినవి. ఆకవితా జడత్వం సామాజిక జడత్వం వదల గొట్టడం ఈ ఉద్యమ కర్తల ఆశయం.

శ్రీశ్రీతోపాటే నారాయణబాబు ఈరీతి కవితలు రచించాడు. వీరితర్వాత కవులు దీన్ని ఎక్కువగా ఆదరించలేదు. అయితే సాహిత్యంలో సరిక్రొత్తమార్పులకు ఊపిరులూదిన ఉద్యమాల్లో ఇది ప్రధానం. 'తెలుగుదేశం అధివాస్తవిక వాదాన్ని తూర్పారబట్టి దాని పైదుమ్మెత్తి పోసి తన తెలివితక్కువతనాన్ని రుజువు చేసికొంది. నిజం ఆలోచిస్తే అధివాస్తకత నవకల్పనకి ఎంతోదోహద మిచ్చింది. ఎంతో అలంకారం కల్గించింది.' అంటారు దాశరథి. అధివాస్తవికతలోని అర్థరాహిత్యము, విశృంఖలత్వము దాని క్షీణతకు ప్రధాన కారణాలు. '...surrealism is in retreat today on

many world fronts. Progressive thought looks on surrealism with suspicion. Orthodax rightist criticism is shocked and scandalised by the surrealist excesses. All the same I think surrealism has not been given a fair chance here in our country. Telugu Poetry at any rate is richer for the during experiments of the neo-surrealists.'- అని అంటారు శ్రీశ్రీ 'సౌదామిని'కి పీఠిక వ్రాస్తూ.

ఈవిధంగా శ్రీశ్రీ తెలుగులో అధివాస్తవికకవిత ఒక నవ్యకవితా ధోరణిగా రూపొందటానికి కృషి చేసిన ప్రయోగశీలి. తెలుగులో సర్రియలిస్టు కవితకు శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబులు ఇద్దరూ రెండు నేత్రాలు.

అధస్సూచిక :

1. చూ. సమాలోచన. సం. 3. సం. 10, 11, పే. 18-20, 11-14
2. Collected Papers of Sigmund Frend. Vol. V. P. 131
3. Quoted by From Bandelaire to surrealism. Marcel Raymond. P. 284
4. Surrealist Manifesto.
5. 'నేటికవిత - క్రొత్త పోకడలు' - వ్యాసం. శ్రీశ్రీ. భారతి. ఫిబ్రవరి 1939.
6. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. P. 175.
7. The History of Surrealism, P. 49. Manrice. Nadecu. Tr. Richard Howard,
8. 'సంఘర్షణ' వ్రాసిన 'ప్రవర'నుండి రుధిరజ్యోతి. పు. 6.
9. 'త్వమేవాహం' పు. 63 లో దాశరథి లేఖ.

—···—

# మేలుకొలుపులు

— కుమారి ఎస్. లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

వర్ణనాత్మకముగ నున్న మేలుకొలుపులలో ప్రకృతివర్ణన గలిగి మనోజ్ఞముగ నున్నది.

'కోళ్లు గూసెను అలసటదీరెను కోమలులకు
తెల్లనాయెను తేజమణగెను దీపములకు
చల్లి చుక్కలు గాంతి తరిగెను
చంద్రునకును
పద్మములెల్ల విరిసె చెట్లకు వచ్చె మధువు
ఉదయపర్వత మందు సూర్యు
డుదయమాయెన్
లోకులు ముదముజెందిరి సకల దిక్కుల
పొదలె కాంతుల్'

దీనియందు ప్రకృతి సహజ సుందరముగ మనోహరముగ నభివర్ణింపబడినది.

సూర్యని పైగల మేలుకొలుపు నందు క్షణక్షణమునకును మారు సూర్యనారాయణమూర్తి ఛాయ స్వభావ సిద్ధముగ వర్ణింపబడినది.

పుట్టేటి భానుడు పుష్యరాగపు చాయ
పుష్యరాగముమీద పొంగు బంగరుచాయ
మేలుకో శ్రీ సూర్యనారాయణా
మధ్యాహ్న భానుడు మంకెన్న పువ్వు
చాయ
మంకెన్న పువ్వుమీద మల్లెపూవు చాయ
మేలుకో శ్రీ సూర్యచారాయణా
క్రుంకేటి భానుడు గుమ్మడిపూ చాయ
గుమ్మడి పూలమీద కుంకుమపువ్వు చాయ
మేలుకో శ్రీ సూర్యనారాయణా
వ్రాలుచు భానుడు వంగపండుచాయ
వంగపండుచాయపై వజ్రపుపొడి చాయ
మేలుకో శ్రీ సూర్యనారాయణా

అనుచు ఈపాట మనోహరముగ తీర్చిదిద్దబడినది. సూర్యభగవానుడు ఆరోగ్యప్రదాత యని మనలో ఒక నమ్మకము కలదు. కావుననే స్త్రీలు ఆయురారోగ్యములను, ఐదువతనమును కాంక్షించుచు సూర్యభగవానుని పూజింతురు.

శృంగార రసాత్మకముగు మేలుకొలుపులన్నియు కృష్ణుని పరముగ నున్నవి. ఇది గృహిణులు గొంతెత్తి మధురముగ గానము చేయతగినవిగ నున్నవి. శ్రీకృష్ణుని గూర్చిన మేలుకొలుపులన్నియు ఇంచుమించుగ శృంగారపరమైనవియును గృహిణులు గానము చేయతగినవియును అయి ఉన్నవి.

ఇరుగుపొరుగు సొమ్ము
ఎరువు తెచ్చుక నేను
నిను చేరవస్తిని లేరా
బలువైన ముత్యాలు
బావిలి చెవిని లేదు
పాన్పు వెతకవలె లేరా
కృష్ణా తెల్లవార వచ్చెనూ
అగరు గంధములు వద్దన్న పూస్తివి
అవి నీళ్ళకడగాలి లేరా
చిగురాకు విడియమ్ము నోరెర్రనాయెను
అత్తుడుచుకోవాలి లేరా
కృష్ణా తెల్లవార వచ్చేనూ

మధుర భక్తిపూరితములగు పాటలు గూడ శృంగార రసాత్మకములే. అయిన భగవంతునకు, భక్తునకు నడుమగల ప్రేమ భావమును మధురభక్తిగా పేర్కొనిరి. శ్రీకృష్ణుని గోపికలు భగవంతునిగా భావించిరి. కావుననే శ్రీకృష్ణునకు గోపికలకు నడుమ గల అనుబంధమును మధుర భక్తిగా పేర్కొనిరి.

'తెల్లవారెనమ్మ చెల్లె నేనేమందు
నల్లని నాస్వామి లేరా

మరల పండుక నీవు మసలుచున్నావు
మర్యాద గాదింక లేరా
శ్రీబాల గోపాల శ్రీలోల సత్కృపా
ధర్మ పాలుడ లేచిరార
చాలుచాలీరీతి పాలుమాలగ నేల
వేళ గాదు లేచిపోరా
పొమ్ము టి ననుచు నీబుద్ధిలో నెంచక
ప్రొద్దులేదని యంటి లేరా
దీపకాంతులెల్ల తెలతెల నయ్యెను
దేవదేవ మేలుకొనరా

వేదాంతపరముగ నున్న మేలుకొలుపులలో శివుని మేలుకొనుమని ప్రార్థించుచున్నారు. దీనియందు జీవేశ్వరైక్యము ప్రతిపాదింపబడినది.

మేలుకొనవే జీవహంస మేలుకొనవే
పరమహంస
మేలుకొని సద్గురుని కరుణను
మేలు జెందెదవూ

అనునది వేదాంతపు మేలుకొలుపులలో పరాకాష్ఠ నందినది. ఈ పాటయంతయు శ్లోకము తాత్పర్యరూపమున నున్నది.

'ఋణానుబంధ రూపేణ
పశుపత్నీ సుతాలయాః
ఋణక్షయే క్షయం యాంతి
కాతత్ర పరివేదనా
ఋణము చేతను పశువు పత్నులు
ఋణము చేతనె సతిసుతాదులు
ఋణము తీరిన వెనుక వారొక
క్షణము నిలువరుగా
జలముపైనీ బుద్బుదంబులు
ఇలను తనువులు నమ్మబోకుము
శరణుజొచ్చి చిత్తమున గురు
చెంత జేర్చుకొనుమా జీవా
మేలుకొనుమా'

ఋణానుబంధరూపమున నే పశుపత్నీ సుతులు లభింతురు. వారి ఋణము తీరిన వెనుక వారు క్షణమైన నిలుకరు గాన నీటిపై బుడగవలె జీవితము అశాశ్వతము గాన సద్గురుని సేవచేసి ఐక్యమును పొందుమని ప్రబోధించుచున్నదీ పాట.

మేలుకొనవే రాజహంసా
మేలుకొను చైతన్యమా
మేలుకొనవే శుద్ధవిదియా
మేలుకొనగదవే జీవా మేలుకో

అనునది గూడ వేదాంతపు మేలుకొలుపులలో చేర్కొనదగినది.

అత్తింటి ముద్దుకోడలికి మేలుకొలుపు అనుపాట ఎల్లోరా గారి సేకరణలో గలదు__

జాజి పూల జలకమాడి
పాలవెల్లి పాలకెక్కి
అత్తయింట నడుగుపెట్టి
మొగుడురాగ మొగముదాచి
ఎందుకింత సిగ్గుపడుదు
వేల నీకు యింత సిగ్గు?
తాడిచెట్టు తలనుదన్ని
తాత నీడ తరిగిపోయె
నిదురలెమ్ము నిమ్మకాయ
కళ్లువిప్పు కందపిలక
త్వరగ లెమ్ము తల్లిగాదె
చిలుకవచ్చి చెట్టుమీద
పిలుచుచుండె పిల్ల నిన్ను
వేగ లెమ్ము వెన్నయిదిగా
కిత కిత కిత కిత కిత

ఇదిగూడ మేలుకొలుపే కాని దీనియందలి భావమంత యుదాత్తముగ నుండదు.

అదేవిధముగ వదినగారిపై రచింపబడినదిగూడ ఉదాత్తతను లోపింపజేయును. ఆమెను హేళన చేయుచు ఆమె లోపముల నెత్తిచూపుచుందురు.

మేలుకోగదే మేలుగాగ వదినె
నీలవేణి జాగేల తెల్లవారె
బాలసూర్యబింబ ముదయించె మింట
యెల్లవారు గనిన వేగవచ్చు తంట
కలకలమని యిల పక్షిజాల
ములుగవగూడి చేరి కూయసాగె
పూలసెజ్జపైని దేలు నిద్దురవె
సోలి తూలినట్టి సొక్కు దెలియదేమొ
ముచ్చులైన నీదు తుచ్ఛసోదరులు
ముచ్చిలించి తెచ్చె హెచ్చునగలు వేగ
రచ్చవారు చేరి అచ్చ మీయింటికి
చర్చవారంటూ దెచ్చినారు గాన
చాలచాలరకము పిండివంట లొండి
నలుబాది పళ్ళెరముల నిండ తెచ్చె
ఫలహారముకు వేళమించ వచ్చె
ఘాలి సుబ్బరాయ కవి కృతినెచ్చె

ఈ పాట ఘాలి సుబ్బారావు రచించిన స్త్రీల వేడుక పాటలను పుస్తకములోనిది.

దేశభక్తిని ప్రబోధించు మేలుకొలుపులను కొన్ని కలవు. దేశభక్తి గేయములలోని మేలుకొలుపులు ప్రబోధ రూపమున నుండును. దేశభక్తి గేయములు ఒక ప్రయోజనము సాధించి రచింపబడినవి. ఆ ప్రయోజనము సిద్ధించిన వెనుక నవి నశించిపోవును.

మేలుకొనుమీ భరతపుత్రుడ
మేలుకొనుమీ సుజనమిత్రుడ
మేలుకొనుమీ సచ్ఛరిత్రుడ
మేలుకొనవయ్యా వత్సా మేలుకో
వేడుకను జాతీయతా యను
వేగుచుక్క పొడిచె నదిగో
కూడి 'వందేమాతర'బని
కుక్కుటము లరచెన్
అల్లదె విజ్ఞానమనియెడు
నట్టి యరుణోదయము నాయెను
చెల్లె సంతసకలహ మనియెడు
చీకటడి యెల్లన్
... ... ...
అందరును నీకంటె ముందర
నడుగువేయుచు మెలగుచుండగ
పందవలె నిటు నిద్రపోవగ
పాడి యగునయ్యా
... ... ...
ఆర్యపుత్రుడవై జగంబున
నవతరించియు నీవిధంబున
ధైర్యమెడలి జడత్వమొందుట
ధర్మమగునయ్యా

భారతీయుండె సద్గుణుండని
పాడుతున్నది వినుము భారతి
ధీరవరుడవు నీ స్వశక్తిని
తెలిసికొనుమయ్యా

అనుచు భారతీయ యువకుని సద్గుణుడనియు పేర్కొనుచు స్వశక్తిని తెలిసికొని జాతీయోద్యమము నందు పాల్గొని విజయమును సంపాదింపవలెనే గాని స్థైర్యము విడలి జడత్వము నందుట పాడిగాదని పల్కుచు భారతపుత్రుని మేలుకొలిపెను. ఇది ప్రబోధరూపముననున్నది. ఇదియును మేలుకొలుపే. కాని దీనిని సంప్రదాయ సిద్ధమగు మేలుకొలుపుల యందు చేర్చుట కూడదు. దీనిని మంగిపూడి రచించెను.

మేలుకొనుడు మేలుకొనుడు
మేల్మిబంగరు ఉషస్సిది
ఓ నిద్రామత్తుల్లార ఓ భద్రాప్రమత్తులార
ఈ ప్రాభాతిక వేళను మీ
ప్రాంగణము తెరువుడు
మేలుకొనుడు మేలుకొనుడు
మేల్మిబంగరు ఉషస్సిది

అనుచు స్వతంత్ర భారతావనిలో ప్రాభాతవేళ ప్రకృతి ఎంతసుందరముగా రమణీయముగా నున్నదో వివరించుచు రచింపబడినది. దీనిని చెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రిగారు రచించిరి.

ఇంకొక మేలుకొలుపునందు గురువుగా గురజాడ దలచి అతని మార్గమున పయనింపుమనియు, సస్యశ్యామల భారతదేశమును సుభిక్షముగ జేయుమనియు చైనా జపాను మున్నగు దేశములవలె సంపన్న దేశము కావలయుననియు దేశప్రజలనుద్దేశించి రచింపబడినదీ పాట.

మేలుకలుగగ మేలుకొనుడోయ్
మేలుకొని మునుముందు కేగుడు
గతచరిత్ర నెత్రివ్వుకుంటూ
గడుపుతుంటే లాభమేమిటి
వర్తమానం కళ్ళజోడులా
భావిపథమును జూడవేమిటి

సూర్యభగవానునిపై రచింపబడిన మేలుకొలుపు వింతగ మనోహరముగ నున్నది. లోకమునంతను తన కిరణ ప్రసారముచే మేల్కొలుపునట్టి సూర్యభగవానుని స్త్రీలు మేలుకొనుమని ప్రార్థించుట వింతగనే యున్నది.

ఉదయభాస్కర మేలుకొనుమీ
బాలభాస్కర మేలుకొనుమీ
సూర్యభాస్కరా మేలుకొనవయ్యా
సూర్యభాస్కరా మేలుకొనవయ్యా
కలకలామని ప్రొద్దుపొడుపున
కమలములు వికసించిరాగ
గుబగుబామని నరులు గోవుల
క్షీరములు పితుకన్
సూర్యభాస్కరా మేలుకొనుమీ
కుంతిదేవి సతీదేవి కమలాక్షి
గౌరీదేవి అరుంధతి మొదలైన అట్టి
స్త్రీలెల్ల అలికి పూసి ముగ్గుపెట్టి
ముందుగానె మిమ్ము తలచి
నీలవర్ణ మీ రాకడకు నిలచియున్నారు
సూర్యభాస్కరా మేలుకొనుమీ
... ... ...
కమలగర్భుడు శ్రీరామచంద్రుడు
అర్ఘ్యమిదిగో భాస్కరుల కనుచు
నీలవర్ణమీ రాకడకు నిలచియున్నారు
సూర్యభాస్కరా మేలుకొనుమీ
చక్కగా మీ భక్తురాలు
సరసిజాక్షి మేలుకొలుపగ
పసిడి బింబంవలె స్వామి ఉదయించిరాగ
సూర్యభాస్కరా మేలుకొనుమీ

అని ప్రభాతసమయము నందలి మనోహర దృశ్యములు కనులపండువుగ తీర్చిదిద్దబడినవి. పెద్ద బ్రాహ్మణ బ్రహ్మచారులు, కుంతీదేవి, సతీదేవి, అరుంధతి, మున్నగు పతివ్రతలు, సురలు, మునులు, అర్ఘ్యమిచ్చుట కొరకు శ్రీరామచంద్రుడును సూర్యనారాయణమూర్తి రాకకై ఎదురుచూచు చుండిరి. బ్రహ్మచారులు, వైష్ణవులు 'ఎంత నిద్రో భాస్కరుల కనుచు, పరిహాసములు చేయుచుండిరి.

సూర్యభగవానుని రాకతోడనే దైనందిన కార్యక్రమములన్నియు ప్రారంభమగును. కావున స్వామిని త్వరగ మేలుకొనుమని ప్రార్థించుచున్నారు. ఈ పాటను స్త్రీ రచించినటుల సరసిజాక్షి అనిన ముద్ర వలన తెలియుచున్నది.

సీతాదేవి, అలివేలుమంగ, పార్వతి, మొదలగు స్త్రీ దేవతల పరముగనున్న మేలుకొలుపులలో వారిని దేవతలుగ నారాధించుచునే వారికి కొన్ని బుద్ధులను గరపుచుండిరి. అలివేలుమంగపై రచింపబడిన మేలుకొలుపు నందు–

నెలత తన పతికన్న ముందు మేలుకొనవలె
జలజాక్షి జామాయె నమ్మ మేలుకో

పతికన్న ముందు మేలుకొనుట పడతి ధర్మమని యామెకు బుద్ధిగరపిరి. సీతాదేవి మేలుకొలుపునందు —

అదిఏమె మాయమ్మ అలుక కాయరాదు
అత్తవారియిల్లు లేవే
పలుకవేమే నిను బ్రతిమాలుకుంటాను
బద్ధకించక వేగ లేవే

అత్తవారి యిల్లు గావున బద్ధకించక వేగ లేవవలయుననియు, అలుక చేయరాదనియు ఆమెను హెచ్చరించిరి. ఈ పాట మద్దాల వెంకటాచలదాసు రచించినటుల దీనియందు గలదు.

ఇటీవలి కాలమున చలనచిత్రములందు గ్రామీణ వాతావరణమును సృజించుటకై పెక్కు సన్నివేశములను కల్పించుచుండిరి. అట్టివానిలో పేర్కొనదగినది మేలుకొలుపులు కానీ ఈ పాటలు సంప్రదాయ సిద్ధమగు మేలుకొలుపులుగా గుర్తింపదగినవి కావు.

'మేలుకో శ్రీరంగా మేలుకోవయ్యా
కావేటిరంగా శ్రీరంగా మేలుకోవయ్యా

అనునది చలనచిత్రము లందలి మేలుకొలుపులలో ప్రముఖమైనది.

# ఋషి కవి అవుతాడా? కవి ఋషి కావాలా?

- శ్రీ మ. సత్యనారాయణమూర్తి (భారతీప్రియ)

మనవాళ్ళు చాలమంది కవిత్వాన్ని గురించి ఉపన్యాసం మొదలుపెడుతూనే "నా నృషిః కురుతే కావ్యం" అని కొటేషన్‌తో ఎత్తుకుంటారు. ఇంక అక్కడ నుంచీ కవి క్రాంతదర్శి అనీ, కవయతి వర్ణయతీతి కవిః అనీ, పాండిత్య ప్రవాహం వెల్లివిరియిస్తూ ఉంటారు. మనం కొంచెం నిదానంగా ఆలోచించి మన ఇప్పటి కవులు ఋషులేనా? అసలు కవులు ఋషులేనా? అసలు కవులు ఋషులు కావాలా? లేక పూర్వకాలంలో లాగానే ఋషులే కవులౌతారా? అని ఆత్మవిమర్శ చేసుకుంటే సత్యం గోచరమౌతోంది.

మన జాతీయ సాహిత్యగ్రంథాలయిన రామాయణ భారతాలు రచించిన వారు వాల్మీకి వ్యాసులనే మహర్షులు. ఆ గ్రంథాల కథ వారు కల్పించి పాత్రల స్వభావాలు వర్ణించి వ్రాస్తారా? అంటే లేదు. ఆ కథలు ఎప్పుడో ఒకప్పుడు ఈ భూమిపై జరిగాయి. అందుకే వాటిని ఇతిహాసాలు అన్నారు. ఇతి + హ + ఆస = అంటే ఇది ఇలా జరిగెను కదా అని ఆ కథ జరిగిన కథ అని అర్థం. దీన్నిబట్టి రామాయణ భారతాలు కల్పిత పురాణ కథలు గావని, యథార్థ గాథలని, అని పిస్తోంది కాని ఇతిహాసం అంటే అంత మాత్రమే కాదు. మానజాతి జీవితంలో ఎప్పటికీ జరుగుతుండే కథలు. ప్రతిమానవుని జీవితంలో ఎప్పుడూ జరిగే కథలు అంటే శాశ్వతసృష్టిలోని పరమసత్యాలు అని అర్థం. ఇతిహాసం అనే మాట వెనుక ఇంత కథ ఉంది.

ఇలాంటి ఇతిహాసాన్ని రచించడానికి సత్యాన్ని యథాతథంగా దర్శించి వర్ణింపగల సమర్థుడు కావాలి. అంతటివాడు తపస్సంపన్నుడైన యోగసిద్ధుడైన ఋషి మాత్రమే. అయితే ఆ ఋషి కవి అవుతాడా? కవి అంటే కలంతో విశేషంగా వ్రాసేవాడని అర్థం కాదు, కవి అంటే దేహధారియై ఇహలోక జీవితం ఇది అని జరుగుతున్న దాన్ని చూస్తూ అనుభవిస్తున్న జీవుడు, కవయతి అంటే వర్ణించువాడు అంటే హిమాలయోన్నత శిఖరాలనో, గంగా ప్రవాహ గాంభీర్యాన్నో వర్ణించడం కాదు. వర్ణన అంటే ఉన్నదాన్ని చెప్పడం అలాగే లేనిదాన్ని వర్ణించడం. ఇలా వర్ణించడమే జీవధర్మం. ఎందువల్లనంటే జీవుడు తానున్నానని చెప్తున్నాడు. నిజానికి తాను లేడు. తానుగా ఉన్నది పరమాత్మయే. తన యొక్క వావి వరసలన్నీ వ్యవహారానికి పెట్టుకున్న వర్ణనలే. నిజానికి కవి పరమాత్ముని బహుత్వలీలలనే తనవారు అనబడే వ్యక్తుల ప్రవర్తలను ఉత్తముడైన జీవితప్పుపట్టిన ఋషిలాగా పరిశీలిస్తూ ఉండాలి. తల్లిదండ్రులను, గురు మిత్రులను, భార్యాపుత్రులను, తప్పుపట్టి నిందించి ప్రయోజనం లేదు. వారు పరమాత్ముని రూపాలుగా భావించి తన జీవితం ఒక తపస్సుగా జ్ఞాన సాధనగా గడిపి ఆత్మజ్ఞానం పొందుతే అతడు ఋషి అవుతాడు. అప్పుడతడు భవబంధాలను త్రెంచేసుకొని కాషాయ వస్త్రాలను కట్టుకొని కాయ కసురులు తింటూ కాలక్షేపం చేయడం కాదు చేయవలసిన పని. అలా ఎవరన్నా ఉంటారు. ఇల్లువదిలి సన్యాసులైన వారి నెంతమందినో ఇటువంటి వాళ్ళను చూస్తాము. కాని వాల్మీకి వ్యాసులు అటువంటి ఋషులా! మనవాళ్లు ఎంత చెడినా మనకునష్టం లేకుంటే మనం ఋషిలాగా చెలామణి అవుతాం మౌనం పాటించి. కాని చేయవలసింది అదికాదు. తన వారి ప్రవర్తనవల్ల తనకి గౌరవహాని, కష్టనష్టాలు వస్తున్నాగానీ- అలా భావింపక నిర్మమకారంగా నిరహంకారతను కూడ అవలంబించి నిర్లిప్తుడై వుంటూనే నిపుణంగా వారిమధ్య నిలిచి జీవించగల గాలి. వీరునా వాళ్ళని తప్పుగా ప్రవర్తించిన వారినిగూర్చి చెప్పుకోగలగాలి, వారికి ఆశ్రయ మిచ్చి కాపాడాలి.

ఆ విధంగా చెప్పుకో గలిగినవాడు ఋషి- కవి అవుతున్నాడు. వాల్మీకి- శ్రీరాముని ఆదర్శవంతుడైన రాజుగా ఉత్తముడుగా నిరూపించి కావ్యరచన చేస్తే- ఆ రాముడు ఆరోజున పూర్ణగర్భిణిని నట్టడవిలో విడిచిపెట్టాడు. మరి ఋషి బాధపడ్డాడా? తీసుకొచ్చి ఆశ్రమంలో పుత్రుడు పోనీ పిల్లలకు తండ్రిలోపం చెప్పాడా? తమతండ్రిని ఆదర్శమూర్తిగా ఆ పిల్లలు తెలుసుకునేటట్లు రామాయణం గానం చేయించాడు. ఎన్నో తుపానులు, వరదలు, యుద్ధాలు, అగ్నిప్రమాదాలు వచ్చి ప్రళయ తాండవం జరుగుతున్నా దానికి భగవంతుడే కారణం అని నిందింపక అతణ్ణి మనతండ్రిగా మన జన్మకు కారకుడిగా తెలుసుకోవాలి. అదే ఋషితత్త్వం. దాన్ని చెప్పగలిగేదే కవిత్వం.

---

సర్వసాధారణముగ మేలుకొలుపులన్నియు భగవద్విభూతిని కీర్తించునవిగ నుండును. అచ్చటచ్చట కొన్ని హాస్యానుకృతులును గలవు. మేలుకొలుపులు రచించిన వారందరును పండితులు అగుటచే వారి రచనలో యతిప్రాసాది నియమములు చక్కగా పాటింపబడినవి. మేలుకొలుపులు సరళమగు పదజాలముతో రచింపబడినవి గావున నివి స్త్రీలందరును గానము చేయుటకు ఉపయుక్తముగ నుండును. ఇవి భగవద్విభూతిని కీర్తించునవి గావున భక్త్యావేశముతో రచింపబడినవి.

— ... —

మరివ్యాసుడు తా నెలాపుట్టాడు. తా నెలా పిల్లల్ని కన్నాడు. మరొకడైతే ఆ సంగతి చెప్పుకునే వాడేనా ? మనకే ఆశ్చర్య మవుతుంది. మనలో చిన్న మెత్తు లోపం వుంటే, తప్పుచేస్తే దాన్ని ఎంతగానో కప్పిపుచ్చుతాం. కాని వ్యాసుడు ఎంతటి ధీరతతో అహంకార మమకారాలు లేకుండా తన చరిత్ర తన వారి చరిత్రగా భారతం రచించాడు ? ఇతిహాస రచన అంటే అది. ఆ కథలో తానుకూడా భాగస్వామి అయినప్పటికీ సత్యం తప్ప కుండా సర్వం భగవల్లీలగా దర్శించి గానం చేయగలగడం. అటువంటి ఋషిత్వం అబ్బిననాడు మన జీవితంలో జరిగే వృత్తాంతాలు ఈ సృష్టి అంతటా జరుగుతున్నా యని, మనశరీరంలో తత్త్వాలుగా ఉంటున్నా యని దర్శనం లభిస్తుంది. ఇది నీది _ నాది కాని నిత్యసత్యం కనుక చెప్పుకుంటే నీకు_ నాకు ఉపయోగ పడుతుంది. కనుక చెప్పుకోవడానికి సిగ్గు అడ్డురాకుంటే మరింత ప్రయోజనం ఉంటుంది. కనుక ఆ ఋషులు_ తమ జీవితాలనే ఇతిహాసాలుగా దర్శించి గానం చేశారు. అలావారు కవు లయ్యారు.

వ్యాస, వాల్మీకులంటే గెడ్డాలు, మీసాలు పెంచుకున్న ఇద్దరు ఋషులు కారు. వారు రచించినవి రామాయణ భారతా లనే రెండు గ్రంథాలు కావు. ఆ ఋషుల జీవుల స్వభావాలు. వారి రచనలు జీవుల అనుభవాలు. జీవుడికి_ పరమాత్మ అంశ గనుక రెండు లక్షణాలున్నాయి ఒకటి తనయందే తాను రమించడం. జీవుడు కూడా తన ఆత్మయందు తాను 'రమించే' ఆత్మారాముని స్థితియే రామాయణం. అప్పు డతని దేహం ఒక పుట్ట (వల్మీకం) వంటి దని తాను ఆత్మ స్వరూపుడైన రాముడ నని దర్శనం పొందుతాడు. తాను దేహమునంగు పంచేంద్రియాలను మనస్సునూ, అహంకారాది వివిధ భావాలనూ ధరిస్తూ 'జీవించే' దేహ ధారి స్థితియే భారతం. అప్పు డతడు తన ఆత్మయే వివిధ ఇంద్రియాలు గా, మనస్సుగా వివిధభావాలుగా వ్యాసం చెందుతున్న దని దర్శనంపొందుతాడు. ఇలా ప్రతి జీవి వాల్మీకి, వ్యాస స్వభావాలతో_ రామాయణ భారతాను భావాలను పొందుతూ_ తన జీవితమే కాదు, తనవారి జీవితమే కాదు, ఈ సమస్త సృష్టిస్థితి ప్రళయాలు భగవంతుని లీలలుగా భాగవత సత్యములుగా కీర్తన చేయగలుగుతాడు. ఇన్ని విధాలుగా వ్యాసీకరింపబడిన నారాయణుడే వ్యాసుడని_ అతడు దర్శిస్తాడు. ఇలా తన కథని లోకం కథగా, లోకం కథని తన కథగా_ స్వభావోచితంగా అనుభవాత్మకంగా రచన చేయుడమే ఇతిహాస రచన. అందులోని ధర్మాధర్మాలతో ఆ ఋషులకు పనిలేదు. అందుకే అన్నాడు తిక్కన_ 'లోకహితనిష్ఠం బూనికావించె ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమున్' అని. ఆయన ఋషి అయిన కవి కాడా మరి? హరిహరాద్వైతం స్వభావంగా జీవించి అనుభవంగా లోకానికి అందించిన మహనీయుడు గదా. అప్పుడు చెప్పండి

ఋషులు — కవు లవుతారా ?

కవులు ఋషులు కావాలా ?

—...—

# పంచాంగరచనలో వైరుధ్యాలు

—శ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రి

పై శీర్షికతో 7-3-1980 వ తేదీన ఆంధ్రప్రభలో పంచాంగ సంబంధమైన చర్యలను గురించి శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రిగారు ఈసు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఒక వ్యాసమును ప్రకటించిరి. అందు ముఖ్యముగ శ్రీ మాగురువులగు శ్రీపాద వెంకటరమణ దైవజ్ఞశర్మగారిని గురించి, క్యాలెండరు రిఫారమ్ కమిటీ నిర్ణయముల గురించి, శ్రీ కేత్కారు గారిచే ఆదరింపబడి రక్షింపబడిన అయనాంశముల గురించి యింకా యితరాంశములగురించి, రాజమండ్రి శ్రీ వేదశాస్త్ర పరిషత్తు వారిచే 1980 జనవరిలో నిర్వహింపబడిన జ్యోతిష సభలను గురించి వ్రాసియున్నారు. వీటిలో శ్రీమాగురువులనుగురించి, క్యాలెండరు రిఫారమ్ కమిటీ నిర్ణయములనుగురించి మరికొన్ని అంశముల గురించి సమాధానములు చెప్పుచు ఆంధ్రప్రభ కొక వ్యాసమును వ్రాసి పంపితిని. శ్రీ పత్రికాధిపతులకా వ్యాసములో గల యంశములను ప్రచురించుట కిష్టము లేకనో, పక్షపాతముచేతనో ప్రచురించలేదు. వా రట్లు ప్రకటించనంతమాత్రమున బాధించునది యేమియులేదు. సత్య ప్రచారమునకు దీక్షా కంకణము కట్టుకొనిన పత్రిక లనేకములు గలవు. వానియందు ప్రకటించి సత్యమును లోకమునకు తెలుపవలె ననుభావముతో నీవ్యాసమును సమాలోచన పత్రికాధిపతులకు చూపింప వారు తప్పక ప్రకటింపగలమని సహృదయతతో నంగీకరించినందుల కెంతయు కృతజ్ఞుడను.

సత్యము నన్వేషించుటకు ప్రయత్నించుట జ్ఞాని లక్షణము. అసత్యములతో జీవయాత్ర గడుపుకొనుట సాధారణ మానవుని లక్షణము. తత్త్వవేత్తలు, శాస్త్రములయొక్క లోతులను బాగుగ పరిశీలించి మహనీయ విషయములను గ్రహించి లోకమున కందచేయు చుందురు. పూర్వము ఆర్యభటుడు, వరాహుడు, భాస్కరుడు, బ్రహ్మగుప్తాదులు నట్టి మహనీయులు. శ్రీమా గురువులు శ్రీ శ్రీపాద వెంకటరమణ దైవజ్ఞులు గూడ నట్టి మహనీయులలో నొకరనుటలో నెట్టి సందేహము లేదు. వారు బహుకర్మనిష్ఠులు. సత్యాన్వేషణ తత్పరులు. సత్యమును గ్రహించి లోకమున ప్రచారము

చేయుటకు కంకణమును కట్టుకొనినవారు వారి పరిశోధన సారాంశము త్రికాలాబాధకమగు సత్యమును ఋజువు పరచును. వారి నిర్ణయములు సామాన్యబుద్ధికి అందునవి కావు. గొప్ప జ్యోతిష విద్యాంసులకే విశదమగును. వారి పద్ధతియే సరియైనదని సమగ్ర శాస్త్రజ్ఞు లంగీకరించియున్నారు.

1955 లో రామచంద్రపురంలో జరిగిన సభకు తీర్పు చెప్పుటకు వచ్చిన శ్రీ కొళ్ళేగాల్. వెంకట సుబ్బశాస్త్రిగారు (మైసూరు) తీర్పు గ్రంథము 19వ పేజీలో శ్రీమా గురువులను గురించి వ్రాసిన వాక్యము లిట్లున్నవి.

'శ్రీ శ్రీపాద వెంకటరమణ శర్మ సిద్ధాంతిగారు సూర్య సిద్ధాంతమునను, సిద్ధాంత శిరోమణి యందును, పంచ సిద్ధాంతిక యందును, ఆర్యభట సిద్ధాంతమునందును, ఆంగ్లేయ దృగ్గణితమునందును, మహా పండితులు......కనుకనే వీరి పాండిత్యము మహాద్భుతమైనది. అని వారి పాండిత్యమును కొనియాడిరి. కాని తీర్పు చెప్పినప్పుడు తా మనుసరించిన విధానమును దృష్టియందుంచుకొని తీర్పు చెప్పిరి.

శ్రీ సుబ్బశాస్త్రిగారుగూడ శ్రీ పిడపర్తి సోదరులవలె రెండు రకముల పంచాంగములను ప్రకటించెడివారు. (శ్రీపిడపర్తి వారు 1, 2 సంవత్సరములనుండి మాత్రము మానివేసిరి). వీరు తీర్పు గ్రంథము 11 వ పేజీలో 'చైత్రపక్షీయ, రైవతపక్షీయ-అయనాంశములు రెండును తప్పైనవే అని శ్రీశ్రీపాద వెంకటరమణ దైవజ్ఞశర్మగారు చెప్పుచున్నారు. మరియు ఆంగ్లేయ మతమున నక్షత్ర చలనము కానవచ్చుచున్నది. అనియు చెప్పియున్నారు వీరు ప్రతిపాదించిన నక్షత్ర ధ్రువ విచారణ లన్నియు సత్యమైనవే' అని ఒప్పుకొనియున్నారు. ఇంక తీర్పు గ్రంథము నాధారము చేసుకొని శ్రీ పి. చి. కృ॥ శాస్త్రిగారు వ్రాసిన విషయములకు సమాధానము వ్రాయబడుచున్నది.

(1) (5వ పుట) శ్రీశ్రీపాద సిద్ధాంతిగారి (మధిర కృష్ణమూర్తి శాస్త్రిగారి గురువులు) మతరీతిని అనగా సం॥రం 1కి అయనగతి 50''.16 చొ॥న 1585 సం॥రములకు అయనాంశలు గ్రహింపగా వారిదివరకు గ్రహించిన అయనాంశల కన్న 2 భాగలు అధికం అవుతాయి.

అందుచే వీరి అయనాంశలు సరియైనవి కావు. అయనాభావ కాలముగూడ సరిగా నిర్ధారణ చేయబడలేదు.' అని వ్రాసిన దానికి సమాధానము వ్రాయబడుచున్నది.

శ్రీ సుబ్బశాస్త్రిగారు రెండు రకముల పంచాంగములను ప్రకటించే అభ్యాసంగల వారేగాని నిర్దుష్టమైన, శాస్త్రీయమైన, దృక్సిద్ధ పంచాంగమును ప్రకటించినవారు కారనుటలో నతిశయోక్తి లేదు. వీరుగూడ సూర్యసిద్ధాంత మధ్యమరవిని దృక్సిద్ధునిగ భావించి, ఛాయార్క పక్షీయ నాంశములను సాధించియున్నారు. వీరిచే స్వీకరించబడిన సూర్య సిద్ధాంత మధ్యమ సూర్యుడు దృక్సిద్ధుడు కాకపోయినను దృక్సిద్ధు డని చెప్పుట సాహసము. ఈ విధముగ సాధించబడిన అయనాంశములను స్వీకరించిన వారగుటచేతనే శ్రీపాద వారి అయనాంశములు తప్పని వ్రాసినారు.

తప్పుదారినిబడిన కొందరు ఛాయార్క పక్షీయనాంశములు సాధించియుండగ దీనితో దరిదాపుగ వచ్చే చైత్రపక్షీయ యనాంశలను గ్రహించి కొందరు శ్రీమా గురువుల పద్ధతి నాక్షేపించుచున్నారు. సత్యమును చెప్పుటకు, తప్పును ఒప్పుకొనుటకు చేతకానివారు. వీరివాదములలో ఏ విధమైన శాస్త్రీయత లేదు. శ్రీ కొళ్ళేగాల్ వెంకటసుబ్బ శాస్త్రిగారు చైత్ర పక్షీయనాంశములు పరిగ్రహింపకూడదని వారి అయనాంశ నిర్ణయ గ్రంథమున వ్రాసియున్నారు.

అయనాభావకాల విషయంలో, వరాహుని కాల నిర్ణయ విషయంలో శ్రీ సుబ్బశాస్త్రిగారు తప్పుగ అభిప్రాయపడినారు. 421 శా. శకములో ఆర్యభటుడు గలడు. వానిని ప్రస్తావించిన వరాహుడు 427 శా. శకములో గ్రంథమును రచించెను. ఈతని కాలము 427 శా. శక ప్రాంతము కాక 427 విక్రమశక మని చెప్పియున్నారు. ఈ వ్రాత అసంబద్ధమైనది. చైత్ర పక్షవాదులు, ఛాయార్క పక్షంలో 23 అయనాంశముల చిల్లరను గ్రహించేవారు వరాహుని కాలంలో అయనాభావమైనదన్న శ్లోకమును తెలిసియు తప్పు అర్థమును చెప్పి సమర్థింప బూనుకొన్నారు. శ్రీ ఎన్. సి. లాహిరి క్యాలెండరు రిఫారమ్ కమిటీ సెక్రటరీగారు 'సాంప్రతమయనం సవితుః' అను అయనాభావకాల బోధక శ్లోకమును (వరాహకృతము) కమిటీ రిపోర్టు గ్రంథములో ఎక్కడను గూడ ఉదహరించకుండ దానిని దాచి పెట్టినారు. ఈ ఉభయ పక్షవాదులకు ఈ శ్లోకము వజ్రాయుధమై కూర్చుంది. అందుచే దానిని మరుగుపరచడం, తప్పు అర్థాన్ని చెప్పడం వంటివి జరుగుతున్నాయి.

శ్రీమా గురువులు సూర్య సిద్ధాంత సూర్యుడు దృక్సిద్ధుడు కాడని స్పష్టమగుటవలన వానిలోగల తేడాలను సవరించి దృక్సిద్ధికి సరిపడునట్లు సాధించియున్నారు. ఇట్టి మహత్తరమైన సత్యమును గ్రహించశక్తి లేకయే గతానుగతికంగా మిగిలినవారు నడచుకొనుచున్నారు. ఎక్కువమంది కాదంటే మాత్రం సత్యం సత్యమే కాకపోదు.

(2) (17వ పుట) అందుచే ఇరువది అయనాంశములు కర్మానుష్ఠాన యోగ్య కాల బోధకములు కానేరవు. అందువల్ల శ్రీ శ్రీపాద వెంకట రమణ దైవజ్ఞులు స్వీకరించిన అయనాంశములు పరిగణింప తగినవి.

ఇక్కడ 'అందుచే' అనుటకు పూర్వము 15, 16 పేజీలలో వ్రాసిన విషయమును గురించి వీరే విషయమును ప్రస్తావించక పోవడం శోచనీయము. పూర్వము వ్రాసిన విషయము గూడ విచారించినచో చైత్ర పక్షాయనాంశములు గూడ శ్రీ సుబ్బ శాస్త్రిగారి దృష్టిలో తప్పైనవే యగు చున్నవి. చైత్ర పక్షాయనాంశములు గూడ దృష్టము లే యనుభావములోనే ఛాయా ర్క పక్షాయనాంశము లే స్వీకరింపదగినవి అని 16 పుట చివరలో వారి మతమును తెలిపినారు.

(8) కేతకరు మహాశయులు చైత్ర పక్షాయనాంశములను గ్రహించారు. వి. ఆర్. కె. కేత్కారుగారు ఇలా చెప్పారు. 18 డి. అయనాంశలు స్వతంత్రాలు నవీనములు......కనుక ఇపుడు లుప్త సదృశములు. ఆ కారణముచే పరంపరా శుద్ధములు, గణిత శుద్ధములు, శాస్త్రశుద్ధ ములు అగు 22 అయనాంశాలు ఇచట నాచే ఆదరించబడినవి. పంచాంగ కర్త లందరు 22 అయనాంశలనే గ్రహించ వలసిఉంటుంది.

ఈ కేతకరు మహాశయులు ప్రథమ మున లోకములో బహుళ వ్యాప్తిలో నున్న 22 అయనాంశలను తప్పు అని తెలుసుకొని దృక్సిద్ధమును సంపాదించు టకు ప్రయత్నించి 18 డి, అయనాంశాలు సరియైన వని నిర్ణయించి గ్రంథమును ముద్రించి ప్రచారం చేయగా; న్యాయ దృష్టిలేని, శాస్త్ర తత్త్వ మెరుంగని సాధారణ పంచాంగ కర్తలందరు(చాల మంది) 22 అయనాంశలను గ్రహించేట్లు, నవీన పద్ధతిని వదలిపెట్టి గ్రంథ రచన చేయుడని కలహించుచుటచేత (కోరుట చేత) ఈ కేత్కారుగారు '22 అయనాం శలు నాచే ఆదరింపబడినవి, రక్షింపబడి నవి.' అని చెప్పినారు.

గాని తాము గ్రహించినట్లు వ్రాయ లేదు. తాము సూర్యసిద్ధాంత మధ్యమ సూర్యుడు దృక్సిద్ధుడని వ్రాసియుండిరి. సూర్యసిద్ధాంత మధ్యమ సూర్యుడే దృక్సి ద్ధుడైన యెడల సాయన మధ్యమార్క - సూ.సి. నిరయన మధ్యమార్కాంతరము అగు అయనాంశములే దృక్సిద్ధము లని సిద్ధాంతములో బోధించుచుండగా ఈయన చైత్ర పక్షమును ఆవిష్కరింప పనియేలేదు. ఛాయార్క - కరణార్కాం తర రూపాయనాంశలనే గ్రహించ వచ్చును. గ్రంథములో వారు వ్రాసిన విషయము ఎట్లున్నదో పరిశీలింతము.

శాకేషడ్గోభితుల్యాం శరది సమభవ
  త్సాంకర్ష ప్రవృత్తిః
రేవత్యాం సౌరవర్షేప దల వసువినా
  డ్యున్మితాధిక్య భావాత్।
మందంమందం పురస్సా ప్రచలతిసతతం
  రేవతీత శ్చతుర్భిః
భాగైర్గ్రేధునాసా భవతి పునరితో
  ష్యగ్రతః సంభవేచ్చ॥
తస్మాద్వర్ష ప్రవృత్తిః పునరపి చయథా
  రేవతీ తారకాయాం।
స్యాత్తాదృక్స వ్యవస్థాకరణ ఇహమయా
  రైవతః పక్ష ఉక్తః॥
ఇచ్ఛేయుర్యేన హాతుంసుదృఢ పరిచయా
  ద్వర్తమానాం ప్రవృత్తిం।
తేభ్యశ్చైత్రాఖ్య పక్షః ప్రచలనరహితః
  సంగృహీతః కిలాత్ర॥

జ్యోతిర్గణితం ప్రథమముద్రణ
424 పుట.

పై గ్రంథములో సౌరవర్ష ప్రమా ణము దృక్సిద్ధ సౌరవర్ష ప్రమాణముకంటె 8½ విలు అధికముగ నుండుటచే సౌర వర్షారంభము తేడాగానున్నది. ఇప్పుడు 4 భాగాలు తేడాలో నున్నది. కనుక సౌర వర్షారంభమును సరిగ గుర్తించుటకు

రైవత పక్షము నాచే చెప్పబడినది. చిర కాలాభ్యాసములోనున్న వర్తమాన పద్ధ తిని (22 అయనాంశల పద్ధతి) విడచుట కెవరికి ఇష్టము లేదో వారి నిమిత్తము నా గ్రంథములో చైత్రపక్షము సంగ్రహించ బడినది, అని భావము.

ఇట్లనుటచేత రైవత పక్షమే కేత్కారు గారిచే చెప్పబడినది గాని చైత్రపక్షము కాదు. ఇతర మతమగు చైత్రపక్షము (ఇది ఛాయార్క - కరణార్క పక్షము. ఈ మాట తీసివేసి కేతకరుగారు చైత్రపక్ష మని పేరు పెట్టిరి.) తమ గ్రంథములో వారి నిమిత్తము సంగ్రహించబడినది. అనగా తన గ్రంథమునుబట్టి వారు కూడ గణితము చేసుకొనవచ్చును. అనిభావము. ఈ భావమునే యీ క్రింది వాక్యాలలో నిరూపించారు.

శకే 1807 వర్షే పంచాంగ త్రయ మాసీత్॥ 22 అయనాంశ ఘటితం సర్వ జన స్వీకృతం ఏకం॥ అపరం నవీనం పట వర్ధనీయ పంచాంగం 18 అయనాంశ ఘటితం। ఆంగ్లతుల్యం సాయనం శ్రీ దీక్షిత ప్రవర్తితమితి। మయాగ్రథ్య మానస్య గ్రంథస్య పంచాంగ త్రయోప యోగిత్వ సంపాదనాయ తదుచిత క్షేప కాదీన్ సంయోజ్య హస్తలిఖితో గ్రంథః సమాపితః (జ్యోతిర్గణితం 2వ ముద్రణ, ప్రస్తావన 21, 22 పేజీలు)

1807 శా. శకములో 22 అయనాంశ లను గ్రహించి అందరు చేయుచున్న పంచాంగము ఒకటి. 18 అయనాంశలు గ్రహించి నూతనముగ చేయబడుచున్నది రెండవది శ్రీ దీక్షిత ప్రవర్తితమైన సాయన పంచాంగం (ఆంగ్ల గణిత తుల్యము) మూడవది. ఈ మూడు పద్ధతు లకు ఉపయోగపడుటకు వీలుగ నాచే గ్రంథము వ్రాయబడి సమాప్తి చేయబడి నది.

ఇట్లనుటచేత కేత్కారుగారు దృక్సిద్ధము కానటువంటి 22 అయనాంశల పద్ధతి పంచాంగ కర్తలను తృప్తిపరచుటకు వారుగూడ తన పుస్తకం కొనుక్కొని పంచాంగ రచన చేయడం నిమిత్తం చైత్ర పక్షమును సంగ్రహించారు గాని చైత్రపక్షం కేతకరుగారిచే చెప్పబడినది గాదు. తప్పు గణితముల ద్వారా యీ పద్ధతిని ప్రవేశపెట్టినారు. దీనిమీద వ్రాయవలెనంటే పెద్ద గ్రంథ మగును. చైత్ర పక్షం తప్పు అని చెప్పుటకు శ్రీ కేత్కారుగారి గ్రంథమే ప్రమాణము. ముఖాముఖిగ శాస్త్రజ్ఞుల సమక్షమున శాస్త్రార్థము జరిగిన యెడల ఈవిషయము ఋజువుకాగలదు. ఈ భయము చేతనే శ్రీ పిడపర్తి సోదరులు రాజమండ్రి సభలకు దూరమైనారు. 22 అయనాంశలు గ్రహించి (చైత్రపక్షమును గ్రహించి) ఎవరు పంచాంగ రచన చేయుదురో వారికి దృక్సిద్ధమునందు తాత్పర్యములే దని భావము. ఆ పంచాంగములు గూడ దృక్సిద్ధ పంచాంగములు కావు. ఈ విషయమై శ్రీ కేత్కారు గారిచే వ్రాయబడిన వాక్యములే ప్రమాణములు. విజ్ఞులైన వారందరు ఈ విషయమును గ్రహించియే యున్నారు. ఇంకను గ్రహించగలరు.

(4) 'వర్తమాన సిద్ధార్థసంవత్సర పుష్కర నిర్ణయంవల్ల శ్రీశృంగేరీ పీఠాధిపతులును చైత్రపక్షాయనాంశలనే స్థిరీకరణ చేసినట్లు స్పష్టమవుతోంది' అని వ్రాసిరి.

దీని విషయంలో శృంగేరీ మఠపంచాంగకర్తయగు శ్రీలంక వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ రౌద్రిపంచాంగ పీఠిక 12వ పుటలో నిట్లు వ్రాసియున్నారు.

'కొందరు సింహ గురు ప్రవేశమునకు అయనాంశ సంబంధమును కల్పించి అయనాంశలలోని భేదమును ఛాయార్క పక్షీయము, రైవత పక్షీయము, చైత్ర పక్షీయము అనువానిలో చైత్రపక్షీయ అయనాంశలను గ్రహించినట్లు, అవి శ్రీ జగద్గురువులకు ఆమోదకరములైనట్లు ప్రకటించిరి. ఇదియును సరి గాదు. మావి ఛాయార్క పక్షీయ అయనాంశలు 23_48_17 వీటి ప్రవృత్తి నిరయనరాశి ప్రవేశమునకు అవసరములేదు.' దీనివలన శ్రీ పిడపర్తి సోదరులు వ్రాసిన విషయము సరియైనది కాదని ఋజువైనది.

(5) 'శ్రీ కంచికామకోటి పీఠాధీశ్వరులగు శ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారిచే చైత్రపక్షాయనాంశాలు అత్యధిక పండితామోదమును పొందినవిగావున చైత్రపక్షాయ నాంశములనే గ్రహించి పంచాంగరచన చేయవలె నని తీర్మానించబడినది.' అని పిడపర్తివారు వ్రాసిరి.

శ్రీ స్వామివారు 1767 భాద్రపద మాసంలో రాజమండ్రిలో సభ జరిగినప్పుడు శ్రీ శ్రీపాదసిద్ధాంతిగారికి ఒక లేఖను వ్రాసియిచ్చిరి. అందు అయనాంశములను గురించి ఇంకను నిర్ధారణ కాలేదనియున్నది. 1967 తరువాత శ్రీవారు ఏసభలో తీర్మానించినారో తెలియదు. ఉభయవాదులు లేకుండ ఏకపక్ష నిర్ణయమంగీకరింపబడదు.

(6) కేలండరు రిఫారమ్ కమిటీవారు 22 అయనాంశాలను అంగీకరించడంలో వారి తాత్పర్య మిట్లున్నది. వారి రిపోర్టు గ్రంథము 16వ పేజిలో.

"Dr, Gorakh Prasad thereafter submitted a note containing his definite Proposals in this respect, which was also circulated amongst the members. He Proposed that 23-15' be taken as the ayanamsa or the vernal equinox day (21st March of 1956) because this will reconcile most of the 'Pancangas' in India based on modern constants' అని గలదు.

21 మార్చి 1956 నాటికి 23°-15' అయనాంశలు గ్రహించితే ఇది చాలామంది పంచాంగ కర్తలను సమాధానపరచును. గనుక దీనిని గ్రహించదగును. అని భావము. అనగా చాలామందిని తృప్తిపరచు ఉద్దేశ్యముతో మాత్రమే యీ చైత్రపక్షాయనాంశములు గ్రహింపబడినవి గాని శాస్త్రీయములు కావని తేలుచున్నది. శాస్త్రచర్చ ద్వారా నిర్ణయింపబడినవి కావనుట నిస్సందేహము.

రిపోర్టు గ్రంథమును సవిస్తరముగ చూచినచో చాల అవకతవకలు కనుపించును. వీరినిర్ణయములు సరియైనవి కానందుననే 'నేషనల్ సైన్స్ అకాడమీ' ఢిల్లీవారు పంచాంగనిర్ణయ విషయమై ఒక సెమినారును ఏర్పాటుచేయబోవుచున్నారు. పంచాంగ సంశోధక సంఘంవారైనా, మరెవ్వరైనా సత్యాన్వేషణ చేసి చైత్రపక్షము దుష్టమైనదని గ్రహించి, దానిని వదలినప్పుడే యీ అయనాంశవివాదము పరిష్కారము కాగలదు. శాస్త్రీయము కాని, వివాదనిలయమైన చైత్రపక్షమును సమర్థింపబూనుట అనుచితము. ప్రభుత్వంవారు కమిటీవారి నిర్ణయప్రకారం పంచాంగకర్తలందరు చేయవలయు నని ఆదేశం ఇచ్చే యెడల కమిటీ నిర్ణయఖండనకు పూనుకొను మహానుభావు లనేకులు గలరని మరువకూడదు. శాస్త్ర ఖడ్గముతో బలాత్కారపు ఆదేశమును తుత్తినియలు చేయగల పరిస్థితులుగూడ సంభవించును.

— · · · —

# రామాయణానికి ఊపిరి ఊర్మిళ

— శ్రీ కె. శారదాప్రసాద్.

'పురాం నవతీతి పురాణం' ఎన్ని మార్లు విన్నా తనివి తీరనిది. ఏదో ఒక క్రొత్తదనాన్ని చూపించే పురాణం. కథ, ఇతివృత్తం ఎంత పాతదైనా దాన్లో ఏదో ఒక గొప్పదనం మనకు కనబడుతూనే ఉంటుంది.

ఆదికవి వాల్మీకిచే రచింపబడ్డ పురాణం నవరసభరితమైన రామాయణం. రామాయణం పేరు వినగానే ఏదో చెప్పలేని ఆనందం మనలను ఉక్కిరిబిక్కిరి చేస్తూ ఉంటుంది. తెలుగువాడి వెలుగు రామాయణం.

సాహిత్యం సమాజానికి దర్పణం వంటిది. సాహిత్యం ద్వారా సమాజాన్ని ప్రగతిపథంలో ముందుకు నడిపించాలి. అలా నడిపించగలిగేదే ఉత్తమ సాహిత్యం అవుతుంది. మరి రామాయణాన్ని ఉత్తమ సాహిత్యం అని మనం అనగలమా? అటువంటి సాహిత్యాన్ని అత్యుత్తమ సాహిత్యం అనడం అతిశయోక్తి కాదేమో!

ఎవరైనా ఒకరు గొప్పవారు కావాలన్నా వారికీర్తి నలుదిశలా వ్యాపించాలన్నా దానికి దోహదకారులు చాలామంది ఉంటారు. కానీ సాధారణంగా మనం అందర్నీ మర్చిపోయి ముఖ్యమైన వాళ్ళని మాత్రమే గుర్తుంచుకుంటాం. రామాయణంలో అలాంటిదే చిన్న విషయాన్ని విమర్శనాత్మకంగా మీ ముందుంచుతాను.

రామాయణంలో రాముడు నాయకుడు. అతడు తాను ఆచరించి ఇతరుల చేత ఆచరింపచేయాలనేది అతని తాలూకు సిద్ధాంతం అందుకే అతడు ఆదర్శజీవి. అంతే కాకుండా తండ్రిమాటను జవదాటకుండా పాటించడానికి తల్లిదండ్రులకు విధేయుడై ఉండడానికి, అన్నదమ్ముల ఆదర్శజీవనానికి, ఆలుమగల సుఖదాంపత్య జీవితానికి మార్గదర్శి రాముడు. అందుకే రామాయణాన్ని చదవగానే రాముణ్ణి ప్రేమించాలని, రావణుణ్ణి ద్వేషించాలని ఎవరూ చెప్పకుండానే అతి సులభంగా అవగతమవుతుంది. మరి ఇంతటి ఆదర్శమూర్తి మహా పరాక్రమశాలి కూడాను.

వీరుడైన రాముడు నూనూగు మీసాల నూత్న యౌవనంలోనే రాక్షసుల్ని మటుమాయం చేసి యజ్ఞాల్ని నిర్విఘ్నంగా కొనసాగేలా చేసి, క్షత్రియోచితమైన ప్రజ్ఞను ప్రదర్శించేడు. కానీ రావణుడిని మటుమాయం చెయ్యడం అంటే మాటలతో పని గాదు. అంతటి పరాక్రమశాలి రాముడు కూడా వానరులు, లక్ష్మణుడు మొదలగు వారి సహాయంతో రావణాణ్ణి వధించేడు. రావణవధానంతరం రాముడు జగజ్జెట్టిగా ఆదర్శవంతుడయ్యాడు.

అయితే రాముడు ఇంతటి పరాక్రమశాలిగా, ఆదర్శమూర్తిగా చరిత్రపుటలలో నిలిచిపోడానికి మూలం ఒక అమృతమూర్తి. ఆమె త్యాగాన్ని చెప్పడానికి భాష కే అతీతమవుతుంది. ఆ కరుణామయి 'ఊర్మిళ'!

చాలమంది ఆశ్చర్యపోతారు ఊర్మిళ ఏం త్యాగం చేసిందా? అని. ఒకసారి పరిశీలిద్దాం రామునితోపాటుగానే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు కూడా వివాహం జరిగింది. వివాహానంతరం కొన్ని సంవత్సరాలు అందరూ చక్కటి దాంపత్య జీవనాన్ని రుచిచూసేరు.

కాలచక్రం పరిభ్రమించింది. కైక కోర్కె తీర్చే నిమిత్తం రాముణ్ణి వనవాసం చెయ్యమని దశరథుడు ఆదేశించేడు. ఇక్ష్వాకువంశంలోనే ఆడిన మాటతప్పే ఆచారం లేదు గాబట్టి దశరథుడు కైకకిస్తానన్న వరాలమూలంగా రాముణ్ణి అడవులపాలు గమ్మని కోరవలసివచ్చింది. మరి అదే ఇక్ష్వాకువంశంలో పుట్టిన రాముడు తండ్రిమాటను పాటించేడనడంలో విశేషం లేదు. అకారణంగా రాముడు నారచీరలు ధరించి అడవికి సిద్ధమయ్యేడు. మరి పతితోడనే 'సతి జీవితం గాబట్టి, ఆమె పతివ్రత అవడం చేత, తన తండ్రి జనకుడు మహాతత్వవేత్త, జ్ఞాని అవడం చేత, అటువంటి క్షత్రియ వంశంలో పుట్టి, ఇనకులసోముడు రాముడి భార్య అవడంచేత సీత రామునితో వనవాసానికి సిద్ధమయ్యింది.

భాతృవత్సలుడు, అన్నగారి పైని అమితమైన భక్తివిశ్వాసాలు గలవాడు, లక్ష్మణుడుగూడా అన్నవదినలతో వనవాసం చెయ్యడానికి వెనకాడలేదు. అన్నదమ్ములిద్దరు శరీరాలు వేరైనా ఆత్మ ఒక్కటిగా జీవిస్తున్నవారు. అలా వెళ్ళుతున్నారంటే సమంజసమే అనిపిస్తుంది. కాని సీత లాంటిదే కదా ఊర్మిళ కూడా! మరి లక్ష్మణుడు వెళ్ళిపోతే ఈమె ఏం కావాలి? ఒకరోజు కాదు. రెండు రోజులు గాదు, పద్నాలుగు సంవత్సరాలు. ఇలా పద్నాలుగు సంవత్సరాలు ఒంటరిగా ఉంటే తనను గురించి లోకం ఏమనుకుంటుంది? కాలాంతరంలో ఈమె ఎన్ని సమస్యలు ఎదుర్కోవాలి? అందుకే చమత్కారంగా లక్ష్మణుడు అన్నని, వదినగారిని తనకంటికి రెప్పలాగ చూసుకోవాలి గాబట్టి. అటువంటప్పుడు తనకు నిద్ర అసంభవమని అతని నిద్రని తనభార్య ఊర్మిళకు ప్రసాదించి లోకంలో అపవాదు పాలుగాకుండా తనకార్యాన్ని నెరవేర్చుకోవడానికి ఎటువంటి ఆటంకం లేకుండా ఆ సమస్యని అక్కడికల పరిష్కరించేడు.

మరి ఈమె ఎంతటి త్యాగమూర్తి ఆలోచించండి. భర్త ఆజ్ఞానువర్తినిగా ఈమె అంతఃపురంలో ఒంటరిగా ప

నాలుగేళ్ళు గడపవలసి వుందంటే ఎంతటి ఆత్మవిశ్వాసం ఉండి ఉండాలి? ఈమె భర్త అలా అడవులపాలు గావడానికి అంగీకరించి ఉండి ఉండకపోతే రాముడికి అంతకీర్తి వచ్చి ఉండేది కాదేమో! అన్న వదిన లిద్దరికీ నిత్యం భక్తి శ్రద్ధలతో సేవల నందించే వాడు. ముఖ్యంగా యుద్ధ సమయంలో ఇంద్రజిత్తుని వధించడానికి పద్నాలుగేళ్ళు నిద్రాహారవర్జితుడు కావాలి. అందుకు లక్ష్మణుడు నేనున్నా నని యుద్ధానికి సిద్ధమవుతాడు. రాముడు 'గుహుడు ఫలాల్ని ఇచ్చినపుడు నేను నీకు ఫలాన్ని ఇచ్చేనుగదా. మరి అలాంటప్పుడు నీవు నిద్రాహారవర్జితుడవు ఎలా అవుతావు'? అని ప్రశ్నిస్తాడు. అందుకు బదులుగా లక్ష్మణుడు ఆ ఫలాన్ని తాను తినలేదని తిరస్కరిస్తే అన్నగారి ప్రసాదాన్ని తిరస్కరించిన వాడిని అవుతా నన్న భయంతో తన తొడలో దాచి ఉంచే నని దానిని తిరిగి మరల అన్నగారికి సమర్పిస్తాడు. యుద్ధానికి వెళ్ళి విజయాన్ని సాధిస్తాడు. అసలు దీనికంతటికీ మూలం అడవిలో ఊర్మిళ పద్నాలుగు సంవత్సరాల కాలం భర్తను వదులుకోవడమే కదా! లేకపోతే రాముడికి శత్రుశేషం ఉండిపోయేదేమో!

అందుచేత అపురూపపు త్యాగమయి ఊర్మిళ. రాముడి విజయానికి ఈమె పరోక్షంగా ఎంతగానో తన సహాయాన్ని అందించింది. రాముడు అటువంటి విజయ పరంపరలను సాధించబట్టి నేటికీ అందరికీ ఆదర్శమూర్తి అయ్యేడు. రామాయణం భారతదేశానికి శిరోధార్యం అయింది. ఇంతటి అమూల్య గ్రంథంలో ఈమె పాత్ర చాలా చిన్నదిగా కనిపించి నప్పటికీ బృహత్తరమైనది. అందుకే అసలు 'రామాయణానికి ఊపిరి ఊర్మిళ' అనాలనిపిస్తుంది.

...0...

ఆధునిక సాహిత్యంలో అంధయుగం ?

## ఉషఃకిరణాలు ఒక ప్రామాణిక గ్రంథమేనా ?

— శ్రీ చిత్రగుప్తుడు.

❋—❋—❋—❋—❋—❋—❋—❋—❋—❋—❋—❋—❋

(గత సంచిక తరువాయి)

158. 'తరిగొండ వేంగమాంబ కృష్ణ పదాంకితముగా నొక ద్విపద శతకము రచించెను. ఇందు 137 ద్విపదలు కలవు. 'ఆమె రచించిన భాగవతము ద్విపద లభ్యమగుట లేదు' (పుట 150)

వేంగమాంబ కృష్ణమంజరి - మంజరి. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానమువారు తమ 'బుల్లెటిన్'లో ప్రచురించినారు. భాగవతము లభ్యమై శ్రీ కె. యన్. కేసరిగారు 1931 లో గృహలక్ష్మి, మార్చి, ఏప్రియల్ సంచికలలో ప్రచురించినారు.

163. 'తంజావూరు నాయకులలో కట్టకడపటి వాడైన శహాజీ (1833-1855) రచించిన 'అన్నపూర్ణా పరిణయ' మను యక్షగానము ఒక ప్రసిద్ధి నందుకొన్నది. శహాజీ మహారాజు రెండవ శరభోజి కుమారుడు ఇతడు రచించిన 'అన్నపూర్ణా విజయమున' ఇతివృత్తము కొంకణేశ్వర దేవుడు అన్నపూర్ణమ్మను వివాహమాడిన కథ. రెండవ శరభోజీ మహారాజు కూడ కొన్ని యక్షగానములు రచించెను.'

అన్నపూర్ణా పరిణయకర్త శహాజి కాదు. శివాజి అని గ్రంథకర్త కృత్యంతరమైన శారదా ధ్వజమున గలదు. 107 పుట. ఇదే సరియైనది. అన్నపూర్ణాపరిణయము, విజయము కాదు. రెండవశరభోజీ యక్షగానరచయిత గాడు. సంస్కృత కుమార సంభవ చంపు వీరిని కృత్యంతరము. త్యాగరాజీ ప్రభువు కాలము వాడు. సరస్వతీ మహాలు సంస్థాపకుడు.

191. 'ముడుంబి నరసింహాచార్య స్వామి' రుక్మిణీ కృష్ణుల శృంగారమును వర్ణించు లింగేశ శతకమున విప్రలంభ శృంగారమును రసవంతముగా చెప్పెను'.

స్వామి వారు శుద్ధవైష్ణవుడు. లింగేశ శతకము నెట్లు రచించియుంపదొరకొనును? 'పీతభవ తృష్ణ రంగేశ వేష కృష్ణ' యను మకుటముతో సీసపద్య శతకము 1864 లో శ్రీరంగ నాథుని దర్శించిన పిమ్మట చెప్పిన లఘుకృతి. వావిళ్ళవారు దీనిని ముద్రించిరి. అగ్నిద్యోతను డను బ్రాహ్మణుడు కృష్ణుని కడ కేగి వచ్చుటలో తడవాయె ననుచు చింతిల్లు రుక్మిణీ మనోవ్యథను, తెల్పు పద్యములు, రంగనాథుని వర్ణన యిందు ప్రధానములు [1]

194. 'ఆచంట సాంఖ్యాయన శర్మ (1864-1933) వీరు సుధానిధి. మనోరమ అను పద్య కావ్యములను' రచించిరి.

మనోరమ స్త్రీవిద్యాభివృద్ధిని బోధించు నాటకము. సాంఘికము. తొలి ముద్రణము గ్రంథకర్తచే 1895 లో. విశాఖపట్టణమున మలిముద్రణము శర్మగారి శతజయంత్యుత్సవ సందర్భమున. [2]

194. గురజాడ శ్రీరామమూర్తిగారు 'వీరి చిత్ర రత్నాకరము చిత్రమైన పద్య కావ్యము' అని చెప్పుచు 234 వ పుటలో '1893 లో చిత్ర రత్నాకరమును మరొక మనోహరమైన కథల సంపుటిని రచించినారు' అని వ్రాయబడినది.

చిత్ర రత్నాకరము మనోహరమైన వచన కథల సంపుటి. పద్యకావ్యము కాదు. అరేబియను నైట్సు అని ప్రఖ్యాతి నందిన వానిలో 'The Sleeper Awakened' అనుదాని స్వేచ్ఛానువాదము.

దీని ప్రథమ ముద్రణ 1879 మద్రాసు శ్రీ నిలయము ప్రెస్సులో. ద్వితీయ ముద్రణ వావిళ్ళవారిచే. కావున చి. ర. పద్యకావ్యము కాదు. 1879 లో ప్రథమ ముద్రణము వెలువడుటచే 1893 లో కవి రచించుట భావ్యము కాదు. 3

198. 'దేవులపల్లి సోదరకవులు సుబ్బరాయశాస్త్రి. తమ్మనశాస్త్రి ప్రసిద్ధులు. మహేంద్ర విజయము అను పేరున వీరు రచించిన ఆంధ్రప్రబంధము' మహేంద్ర విజయము జమిలి కవిత్వము కాదు. అశేష శేముషీ దురంధరులైన సుబ్బరాయ శాస్త్రి గారిదే.

314. 'నడకుదుటి వీరరాజుగారు (1871-1937) వచన రూపమున అనేక పురాణములు వెలయించుటయే కాక విమర్శలనేకము ప్రకటించిరి. అముద్రిత గ్రంథములయిన ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకము, మద్దిరాల వెంకటరాయకవి ఏకాంత సీతావిలాసము పరిష్కరించి విపుల పీఠికలతో ప్రకటించినారు'.

ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకమును మద్రాసు విశ్వవిద్యాలయము వారు ప్రకటించగా నది దోష భూయిష్ఠముగా నున్నదని పిఠాపురము రాజా రావు సూర్యారావు బహద్దరువారు తమ గురువర్యులు ఆస్థాన విద్వాంసులునైన ఓలేటి వెంకట్రామ శాస్త్రి గారిచే పరిష్కరింప జేసి, టేకుమళ్ళ అచ్యుతరావుగారిచే పీఠిక వ్రాయించి ప్రకటించిరి. వి. మా. నా. అముద్రితము గాదు వీరరాజు గారు పీఠిక వ్రాయలేదు. వారు పరిష్కరించ లేదు ప్రకటించలేదు.

ఇంతకును గ్రంథకర్త చెప్పదలచుకొన్నది ఎల్లనార్యుని కృతమైన శ్రీ రాధా మాధవము గ్రంథము. ఇది అంతకుముందు అముద్రితమే. 1936 లో తూ|| గో|| మండలాంతర్గత కపిలేశ్వరపురజమీందారులు శ్రీ బలుసు బుచ్చి సర్వారాయుడు గారు దీనిని ప్రకటించిరి. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులవారు పరిష్కరించిరి. ఓలేటి వేంకటరామశాస్త్రి గారు పరిచూచిరి వీరరాజుగారు మునిపలుకు వ్రాసిరి 4

315. 'తాతా సుబ్బారాయశాస్త్రి గారు' వఝల చిన సీతారామశాస్త్రి గారును, దువ్వూరి వేంకట రమణశాస్త్రి గారును వీరి శిష్యులలో ముఖ్యులై తెనుగు వ్యాకరణము మీద మంచి పరిశోధనము చేసి ఉద్గ్రంథములను ప్రకటించినారు.'

వఝలవారి విషయమై మన మేకీభవచ్చును గాని, వేంకటరమణ శాస్త్రి గారిని గూర్చి కొంత చెప్పవచ్చును వీరు 1941-63 సం||ల నడుమ నాంధ్ర విశ్వవిద్యాలయమున పండిత పదవి నలంకరించి, వ్యాకరణ పుటోజ్జ్వలై ప్రఖ్యాతి గన్నవారు. 1964 వరకు వ్యాకరణ శాస్త్రములో వీరు వఝల వారివలె ఉద్గ్రంథము లెవ్వియు ప్రకటింపలేదు. 1964 లో వీరి బాల వ్యాకరణ సమీక్ష వెలువడినది. కాని ఉషః కిరణాలు 1960 లోనే ముద్రితమైనది గదా! ఆంధ్ర శబ్ద చింతామణి వలె నంత ఖ్యాతమైయున్న బాల వ్యాకరణ సమీక్షా రచనము నే గ్రంథకర్త విని ఇట్లు వ్రాసియుండును.

254. 'వీని యన్నింటిలోను స్వతంత్ర రచన ఈ మంజరీ మధుకరీయమే. 1860 లో ఈ నాటకము రచించిరని వీరి కుమారులు శ్రీ కోరాడ రామకృష్ణయగారు పేర్కొనినారు'

రామకృష్ణయ్యగారు రామచంద్ర శాస్త్రి గారి మనుమలు. 'రామచంద్ర కవికి ముగ్గురు పుత్రులు. ఇద్దరు పుత్రికలు లక్ష్మీమనోహరము, రామకృష్ణశాస్త్రి, దుర్గానాగేశ్వరశాస్త్రి యనువారలు.... రామచంద్రకవి జ్యేష్ఠపుత్రుడగు లక్ష్మీమనోహరంగారికి ఇద్దరు కుమాళ్లు. రామకృష్ణయ్య, శేషావధానులు అనువారు.' ఈ రామకృష్ణయ్యగారే కోరాడ రామకృష్ణయ గారు. ప్రఖ్యాత భాషాతత్త్వ వేత్తగా మనకు పరిచితులు.

329. 'వేటూరి ప్రభాకరశాస్త్రి గారు శ్రీనాథుని కవితపైని వ్రాసిన 'విమర్శ యీ శ్రేణిలోవచ్చిన ఉత్కృష్టగ్రంథము' పేరు చెప్పక గ్రంథకర్తను వ్రాయుట అలవాటు గనుక మనమే శ్రీ శాస్త్రి గారి గ్రంథ మేదియో కనుగొన వలయును. అది శృంగార శ్రీనాథము. ప్రభాకర శాస్త్రి గారి కీర్తిలతకు పట్టుగొమ్మ. శాస్త్రి గారిపీఠిక యీ విషయమై ఏమను చున్నదో చూడుడు.

చరిత్రభాగమని, గ్రంథవిమర్శభాగమని యీ గ్రంథమును దొలుత రెండుభాగములుగా రచియింతిని. కాని గ్రంథబాహుళ్యముచే నిపుడు ప్రథమభాగముమాత్రమే ప్రకటించితిని. విమర్శభాగము వేఱొక గ్రంథముగా వెల్లడింపవలసియున్నది.' 2

కావున ప్రభాకరశాస్త్రి గారు శ్రీనాథునిపై విమర్శ ప్రకటించలేదు. గ్రంథకర్తకు కనీసము గ్రంథము పేరైనను తెలియకపోవుట విషాదకరము. వేయేల వేంకటరాయశాస్త్రి గారినిగూర్చి రెండు తడవలు గ్రంథకర్త వ్రాసి, వారి శృంగార నైషధ వ్యాఖ్యను విస్మరించుట- శృంగార శ్రీనాథము శాస్త్రి గారి Masterpiece అని ప్రశంసించుటయే గాక, కవిచరిత్ర లన్నిటిలో నీకృతి అత్యుత్తమమైనదని కైలాసవాసి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ రెడ్డిరాజ్యచరిత్ర పీఠికయందు కీర్తించిరి. - గ్రంథకర్త కాః. ఉత్తమగ్రంథ మని నిర్ణయించిన పెద్దలకు తలవంపు.

315. 'వేదం వేంకటరాయ శాస్త్రి గారు కావ్యాలంకారచూడామణి, అలంకార సారసంగ్రహము, సాహిత్యదర్పణము వంటి ఉద్గ్రంథములు యథామూలకముగా అనువాదము చేయుటయే గాక, ఉదాహరణ శ్లోకములకు వచనరూపముగ అనువాదములు ప్రకటించిరి.'

పాపము గ్రంథకర్త శాస్త్రిగారి సాహిత్యదర్పణ అనువాదము చూచి, తక్కిన గ్రంథము లిట్లే యుండుననుకొని విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిని గూడ యీ జాబితాలో నిరికించి వారవైచినాడు. చూడామణిని వీరు విని యుందురుగాని, చూచియుండరు.

గ్రంథకర్త వీరేశలింగము పంతులు గారి కవులచరిత్ర తృతీయ భాగమును యథాతథముగా తన గ్రంథమున కెక్కించుకొని వారిని గూర్చి యేమనుచున్నాడో చూడుడు.

'ఆకవుల గ్రంథవిమర్శనము నెడ ఆయనకు అంత దీక్ష లేదు. ప్రసంగవశమున గ్రంథ గుణమును గూర్చియు, ఏకొలది పాటి ప్రశంసయేని యున్నను అది విమర్శన మనిపించుకొనదగిన ట్లుండదు'. (పుట 328)

ఈ వాక్యములు వ్రాసిన చేతులతోనే గ్రంథకర్త 'సాహిత్య విమర్శన మెట్లు జరుగవలయునో ప్రదర్శించుటకిది (కవుల చరిత్ర) మేలుబంతి' అని 412వ పుటలో వ్రాసి ప్రాయశ్చిత్తము చేసికొనెను.

ఇవిగాక మిగిలిపోయినవి పేర్లు వ్రాయుటలో తప్పులకు లెక్కలేదు. అయినను లెక్కించుటకు కొన్ని చూపుచున్నాను.

(తరువాయి 19 వ పేజీలో)



ఉభయ గోదావరీ మండలాల పట్టభద్రుల నియోజకవర్గమునుండి శాసనమండలికి పోటీచేసి అఖండవిజయమును చూరగొన్న

శ్రీ బలుసు ప్రభాకర బుచ్చికృష్ణ సత్యనారాయణరావు గారు

# గ్రంథసమాలోచన

## ఆచార్య నాగార్జునుడు

[రచయిత శ్రీ చేబోలు చిన్మయబ్రహ్మకవిగారు ఎం. ఏ. H. No. 23-21-46 లలితానగరం. రాజమండ్రి-4. వెల 6 రూ]

సంగీత మాపాతమధుర మని సాహిత్య మాలోచనామృత మని కొందరందురు. నిపుణుల నైపుణ్య విశేషముచే నీ లక్షణ మొకప్పుడు తారుమారైన ట్లనిపించును. మరొకప్పుడీ రెండు లక్షణములకు భిన్నమైన 'తృతీయః పంథాః' సాక్షాత్కరించును. ఇట్టి విచిత్రబహుళమైన కాల ప్రవాహము లోని బుద్బుద శాబల్యము వాని తళతళలను మించినది

నేటి కవితా ప్రవాహములోని బుద్బుదములలో 'ఆచార్య నాగార్జునుడు' ఒకటి. దీని రచయిత శ్రీ చేబోలు చిన్మయ బ్రహ్మముగారు వీరు 'కవితాజాతుల'చే, వ్యక్తి తాకీతులచే నాంధ్రులకు పరిచితులు. రాజమండ్రివారికి సుపరిచితులు. ఈ గ్రంథము వారిరచనలలో పదునాలవది యని గ్రంథము మొదటనే స్పష్టమగును.

ఇందు నాలుగాశ్వాసములలో సుమారు రెండువందల యేబది పద్యములతో లగింపుకొలదు. వీరు రచించిన యీ గ్రంథము శ్రీ పాలూరివారిచే గణపతికి సమర్పితము. ప్రథమాశ్వాసమున పెందోటుపురవర్ణన, వీరతూచార్య దంపతుల వర్ణన, వారి ప్రార్థన, పుత్రోత్పత్తి, వాని యనారోగ్యము, బౌద్ధభిక్షువు వానికి చికిత్సచేసి తన యధీనము జేసికొనుట, వానిని పెంచి నాగార్జును డని పేరువెట్టి ధర్మ మూపదేశించుటయు వర్ణితములు ద్వితీయమున నాగర్జునుని కాశీయాత్ర, వాని యుపదేశములు, దేశసంచారము, సుహాసిని యను కామాతుర యగు వేశ్యకు బుద్ధి చెప్పుట యజ్ఞశ్రీ ప్రభువునకు సుహృల్లేఖ వ్రాయుట, అహింసా ప్రబోధము వర్ణితములు. తృతీయమున యజ్ఞశ్రీ నాగార్జునుల సమావేశము, సింహళగమనము, ప్రతినివర్తనము, చైత్యాది నిర్మాణము గావింపజేయుట మున్నగునవి కథితములు. చతుర్థమున శ్రీ పర్వత విశ్వవిద్యాలయ ప్రారంభ వర్ణనము, నాగార్జునాచార్యుని బోధల వివరణము, రాజకుమారుని రాజ్యలోభపు వాక్యములచే నాగార్జునుని శరీరత్యాగము, మున్నగునవి వర్ణితములు.

నాగార్జునుడు జన్మచే బ్రాహ్మణుడని కొందరు విశ్వబ్రాహ్మణుడని మఱికొందరు వాదోపవాదములు గావించిరి. మంత్ర తంత్రముల యందు, శిల్పము నందు, ధర్మచింతన యందు, పాండిత్యము నందు, నాగార్జునుడు పేరందినవాడని కొందరు, కాడని మరికొందరు పలుకుదురు. ఎవరి యాధారములు వారివి. ఎవరి యభిమానములు వారివి. కాని యిట్టి బౌద్ధకథను సర్వదేవతా ప్రథమవంద్యుడై యొకమతమున కధిష్ఠానదైవమైన గణపతి కంకిత మిచ్చుట యెంతవరకు ఉచితము? దీనిలోని స్వారస్య మేమి? యని పాఠకుల కనిపించును. బౌద్ధ గాణాపత్యములకు గలసంబంధ మేమి?

అవతారికా నిర్వహణము ప్రాచీనుల పద్ధతిలో నున్నను, కావ్య కన్యను అతిగా కవి ప్రశంసించుట (10. ప. విశిష్టాంధ్రకృతిన్ ఇత్యాదులు), ప్రాచీనాధునిక రీతులకు భిన్నమై యున్నది. అసిస్టెంటు డైరెక్టరు వంటి యన్యభాషా పద ప్రయోగము దోషము కాకపోయినను, కొంతవిచిత్రముగా నగపడును కావ్య వైశిష్ట్యమున కిట్టివి సూచకము లేమో యనిపించును.

రుజాగ్రస్తుడైన నాగేశ్వరునికి చికిత్స చేయవచ్చిన బౌద్ధభిక్షువు శిశువును తన కర్పించినచో నతనికి వైద్యము చేయుదు ననుఘట్టము రసవంతము కాకపోవుటయే కాక గ్రంథముఖ్యోద్దేశ మగు బౌద్ధమతోత్కర్ష భంజక మనిపించును. 'సేవయె పరమావధిగా' అని యా బౌద్ధభిక్షువు పలుకుట వాని ప్రవర్తన కనుగుణము కాదు కదా! బౌద్ధుడైన నాగార్జునుడు కాశీనగరమున నన్నపూర్ణావిశ్వేశ్వరులను దర్శించుట, గంగాతీరమున తపోనిరతు లగు మహాత్ములను గని స్తుతించుట, విశాల నగర రాజశరీరమున పరకాయప్రవేశము చేయుట, భార్యాభర్తల కామశాస్త్ర పరిజ్ఞాన పూర్ణజ్ఞానాపత్యమునకు కావందించుట, మున్నగునవి కవి చెప్పదలచిన దానిని పాఠకుడు గుర్తింపలేనట్లు చేయును. శ్యామస్యంతి యను సుహాసినిని నాగార్జును డంధురాలవు కమ్మని శపించుట వాని పాత్రౌదాత్త్యమును కొంచెపఱచును.

మంత్ర తంత్రాదుల నుత్కృష్టత సాధించి యందువలన రాజులు మొదలగు వారిని వశవర్తులను గావించుకొనిన నాగార్జునుడు యజ్ఞశ్రీకి సుహృల్లేఖ వ్రాయుటయే కాక రాజమాతకు నమస్కరించుట మరింత విచిత్రముగా నగపడును. నాగార్జును డైదువందల సంవత్సరములు పైగా బ్రదికెనను నత్యుక్తిని కవి సమర్థించుట చాలవిచిత్రముగ నుండును. ద్వాపరములోని మహాభారతమునందే రెండువందలయేండ్లున్నవారు లభ్యము కారుకదా. అట్టిచో కలియుగములో నాగార్జునున కిట్టి యాయుస్సు నాపాదించుట

మతచారిత్రరీతులకు విరుద్ధ మగును. ఇట్టి కావ్యమును రచించుటలో కవి మిక్కిలి జాగరూకత వహించి యుండవలసినది. శివునివరమున జన్మించిన నాగేశ్వరుడు బౌద్ధభిక్షువు వలన బ్రదుకుట యనునది పరమేశ్వరునకు న్యూనతావహముకదా. అట్టిచో వాని జన్మకుఁ బరమేశ్వరానుగ్రహమును గారణముగా కవి చెప్పకుండిన బాగుండెడిది.

కథానిర్వహణమున కవి ప్రచారములో నున్న కాకమ్మకథలను నమ్మి నాగార్జునకు సర్వశాస్త్ర పాండిత్యమును, మంత్రతంత్రాదికౌశలమును. రససిద్ధత్వమును వర్ణించి కొన్ని వందల సంవత్సరములు బ్రదుకుటయేకాక రాజును బ్రదికించి; రాజ్యలోభాకృష్టుడైన రాజకుమారుని సామాన్యులవలె తనకు సన్నిహిత తరుడైనవానిని మార్చజాలని వ్యక్తిత్వము కలవానినిగా జేయుచున్నట్లయిన దని గమనింప జాలకుండుట విచారకరము. నాగార్జునుని పాత్రచిత్రణమున నిట్టి మత చారిత్రక గ్రంథమున నింతో జాగరూకత వహింపదగియున్నది. వర్ణనలు యథోచితములుగాక ప్రాచీనానుకృతిలో నడచిన వనిపించును. (పురవర్ణన మున్నగునవి యిట్టివే.)

పదముల్పాడుచు నోరచూపులు (3వ పేజీ 10 ప) ఏపుగుపంటలచ్చి కొక (పే 8-11) వంటిపద్యము లీకావ్యమార్గమున వలసిన పాఠకున కింత యాహ్లాదము కలిగించి కవి కవితాప్రశస్తిని వెల్లడించును. పద్యములు గణపూర్ణము లయినంతగా భావపూర్ణములు కాకపోవుట యగపడి, ఆద్యంతముల పుస్తకమును పరిశీలించినవారికి కసంతుష్టి గలిగించును.

శ్రీకంఠ సోమయాజికు
ధాకృతిపతిపగమశిరహితనిరతిలోకా
లోక ప్రచలిత కీర్తీ
నైకగణాధిపతి కవీశ్వరవినుతీ
(ఆ 4 - 1 ప)

ఇట్టి పద్యము లర్థదూరములై సత్యస్ఫోరకములుగాక క్లేశము గలిగించును. ఆశ్వాసాంత గద్యలు, పుస్తకముయొక్క ఆద్యంతములు కవిని సంపూర్ణముగా పరిచయము గావించును. కవి నాటి ఆర్యమతస్థితి వర్ణనతో పాటు బౌద్ధమతములోని హీనయాన మహాయానములను, ఆయా వాదములను (సర్వాస్తివాదము, స్థవిరవాదము, విజ్ఞానవాదము, బాహ్యార్థవాదము, శూన్యవాదము) బౌద్ధమత గ్రంథవిశేషములను నామ మాత్రముగనైన స్పృశించిన చాల బాగుండెడిది.

ఈ గ్రంథమును పరిశీలించినచో అభిప్రాయములు బిరుదములు మున్నగువానిలోగూడ నాంధ్రులు అక్షరప్రాధాన్యము నంది రనిపించును. కవిపాత్రచిత్రణమున, కథానిర్వహణమున, పద్యరచనమున చూపిన శ్రద్ధ చాల దనిపించును.

కవి తనకావ్యమును 'సాహితీవిమల సౌందర్యములో నిండారినదానిని'గా, విశిష్టాంధ్రకృతిగా, కలకాలము నిలుచుదానినిగా భావించుట వారి ఆత్మవిశ్వాసమును సూచించుచున్నది. అవతారికలో 24వ పద్యమున 'పిన్నయైన బుద్ధికి' ఇత్యాది పద్య మపార్థ సద్యస్స్ఫూర్తికరము, అవతారికా నిర్వహణము సంక్లిష్టమై యేది యెవరిదో తెలియనంత గుబురుగా నున్నది.

అందే 27 పద్యము నెల్లూరు రాజమండ్రి కంటె తక్కువ యను నపార్థమును, ప్రాంతీయవివాదమును, రేకెత్తించునట్లున్నది. మొత్తముమీద పద్యరచన సంపూర్ణ తృప్తికరముగా లేదు. బహుగ్రంథకర్తగా లబ్ధప్రతిష్ఠు డయిన కవి కవిత మరింత పరిపూర్ణతనందవలెనని పాఠకు లాకాంక్షించుట బేసబబు కాదు, ముద్రణ స్ఖాలిత్యబాహుళ్యముతో పాటు అల్పాల్పముగానైనను ఛందోవ్యాకరణ దోషములు పొడచూపుచున్నవి ప్రాచీన పద్ధతి కవితపై నేటి పాఠకులకు మోజు కలిగింపచేయుట కెంతో పరిశ్రమ యవసరము.

# ఈ పక్షంలో

ఇటీవల రాజమండ్రి జాతీయ సాహిత్య పరిషత్తువారి యాజమాన్యమున శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో 'సాహిత్యము భవితవ్యము' అనే విషయముపై ప్రభుత్వ కళాశాలాధ్యక్షులు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు ప్రసంగించియుండిరి.

సభకు శ్రీ ఎస్. రామాచారి (C T.O) అధ్యక్షత వహించిరి. ఇరవయ్యో శతాబ్దంలో బయలుదేరిన సాహిత్యోద్యమాలు వాటికి మూలకారణాలైన సాంఘిక రాజకీయ పరిణామాలూ పునః పునః స్పష్టపఱచిరి. పారిశ్రామిక విప్లవం. మార్క్సిజం. లెనినిజం. స్వాతంత్ర్యోద్యమం సాహిత్యంపై చూపిన ప్రభావం; ప్రకృతి కవిత, భావకవిత, డాడాయిజం, సర్రియలిజం ఫ్రాయిడ్ తత్త్వం, బెర్నార్డ్ షా తత్వం, సింబాలిజం మున్నగు వానిని వివరించిరి. శ్రీశ్రీ కవిత్వంలో అన్ని ఉద్యమాల ప్రభావం గల రచన లున్నాయనిరి.

మహాత్ముని అహింసా సిద్ధాంతం, సహాయ నిరాకరణం సాత్విక నిరోధం వంటి సాంఘిక రాజకీయ ఉద్యమాల ప్రభావం సాహిత్యంపై ఎంతవఱకూ పడిందన్న విషయాన్ని ఎంతు చేతనో వారు వీక్షించారు.

(చూ. ప్రక్క పుటలో)

అనుభూతి కవిత్వానికీ భావ కవిత్వానికీ గల భేద సాదృశ్యాలని వివరించడానికి యత్నించిరి. నేటి రచయితలు భావి రచయితలు; ఈ సాహిత్యోద్యమాల పరిణామ చరిత్రని బాగా పరిశీలన చేసి సాహిత్యాభ్యుదయానికి కృషి చేయాలనిరి. ఒక యువకవి ప్రవచించిన 'మౌనం నాసందేశం' అన్న సుభాషితాన్ని ప్రశంసించిరి. విచిత్రం ఏమంటే ఆ యువ రచయిత తన సందేశాన్ని మౌనాచరణ వల్ల కాక వాచ్యంగా గొంతెత్తి ఉద్ఘాటించడం. అది ఆత్మాశ్రయంగా కాకుండా మరోవిధంగా చెప్పిస్తే బాగుండేది. గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్న సంశయాః, మౌనం పరమ భూషణం అన్న సూక్తులు ఆ యువ కవి ఎరుగక పోవచ్చు. సభ్యులలోను అందరూ ఎరుగక పోవచ్చు. అవి అత్యంత రమణీయములు కదా. 'బాణోచ్ఛిష్ట మిదం సర్వం' అనేనది దృష్టిలో ఉంచుకొని సృజనాత్మక నూతన రచనల అభిలషించడంలో ఆక్షేపం లేదు. శ్రీశ్రీ రచనలలో అనేకం ఈ పరిధికి లోబడి ఉన్నాయన్నది గమనింపదగ్గ విషయం.

గత ఎనభై ఏళ్ళ సాహిత్య చరిత్రావలోకనం చేసినప్పుడు రాజా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం, సౌందరనందం, ఆంధ్ర పురాణం వంటి ఆధునిక ఛందోబద్ధ కావ్యాలని స్పృశించనైనా స్పృశించక పోవడానికి సాహిత్యం అంటే నేడు ప్రచారంలో ఉన్న నవ్యసాహిత్య మనేదే సాహిత్యం అని భావించడం కారణమా ?

సాహిత్య సమగ్రావలోకనం చేయడం ఒక సమావేశ కాలంలో సాధ్యం కాదని భావించవచ్చును.

— ... —

( 16 వ పేజీ తరువాయి )

పుట. 2, 319, 40. నవ్యసాహిత్య వీథులు ఆంధ్రసంస్కృతి. తప్పు.

నవ్యాంధ్రసాహిత్య వీథులు తెలుగు సంస్కృతి ఒప్పు.

పుట. 65. మహంకాళి సూర్యారావు తప్పు.

సుబ్బారాయుడు. ఒప్పు.

పుట. 109. సీతా రామాంజనేయము వేదాంత గ్రంథమును రచించిన పరశురామ పంతుల రామమూర్తి. తప్పు.

లింగమూర్తి. ఒప్పు.

పుట. 117. సింహాసనసాలభంజిక. తప్పు.

సింహాసనద్వాత్రింశిక. ఒప్పు.

పుట. 379. భూపాలీయము. తప్పు.

జాన్ తామస్ క్రైయర్ భూపాలీయము. ఒప్పు.

పుట. 300. తిలకిచర్ల వెంకటరత్నం గారి వచన వాఙ్మయచరిత్ర. తప్పు.

మల్లాది వెంకటరత్నం. ఒప్పు.

పుట. 307. భుజంగరావుగారు ఉపన్యాస దర్పణమును వ్యాసగుచ్ఛము. తప్పు.

నందిరాజు చలపతిరావు. ఒప్పు.

సహస్రదోష జుష్టంబగు నీ గ్రంథమునకు సాహిత్యఅకాడమీ న్యాయనిర్ణేతలు అవార్డునకు సిఫార్సు చేయుట, పుస్తకమును పూర్తిగా చదువకయే సభలలోను పత్రికలలోను ప్రశంసాపరంపర కురిపించుట, అన్నింటికన్న మిన్నగా దీనిని ఎం. ఏ. విద్యార్థులకు రికమెండెడ్ పుస్తకముగా విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘము నిర్ణయించుట, చూడగా ఈనాటి సాహిత్య యుగములో అంధయుగము ప్రారంభమయినట్లు తోచుచున్నది.

1. విజయనగర సంస్థానము – ఆంధ్రవాఙ్మయ పోషణ. నిడుదవోలు వేంకటరావు. పుటలు 93-94. 1965,

* 2. తెలుగుసంస్కృతి పుట 1126 లో మనోరమ పద్యకావ్య మనియేగలదు. ఇది పొరపాటు.

3 విశేష వివరములకు చూ. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషుభాషా ప్రభావము డా॥ కొత్తపల్లి వీరభద్రరావు 1960. పుటలు. 263-269.

4. శ్రీరాధామాధవము. చింతలపూడి ఎల్లనార్యుడు – 1936. ముద్రి.

5. కోరాడవంశప్రశస్తి-చిన్నగ్రంథము- 1951 లో ప్రచురితము – ఇది రామకృష్ణయ్యగారిచే వ్రాయబడియుండును.

6. శృంగార శ్రీనాథము – 1923. బెజవాడ. తొలిపలుకు పుటలు. 1-2

(ఈవ్యాసములోని అంశములు సరియైనవి కావని సాహిత్య అకాడమీ అవార్డు న్యాయనిర్ణేతలుగాని, పత్రికా ప్రశంసలు కురిపించినవారు గాని, విశ్వవిద్యాలయ ఎం. ఏ. పాఠ్యనిర్ణాయక సంఘమువారు కాని, సహృదయ పాఠకు లెవరైన గాని నిరూపించుచు వ్రాసినచో సమాలోచన సంతోషముతో ప్రచురింపగలము.

(సంపా.

— :0: —

Regd. No. H/Rmy-42. malochana 1, August 1980

# ఉద్గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1) | నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) | రు. | _00 |
| 2) | నిర్వచన అధ్యాత్మ రామాయణము | రు. | 20_00 |
| 3) | నిర్వచన మహాభాగవతము | రు. | 30_00 |
| 4) | శ్రీ వేంకటేశ్వర విజయము | రు. | 25_00 |
| 5) | కందమాల నాటకము | రు. | 5_00 |
| 6) | వేణీసంహార నాటకము | రు. | 5_00 |
| 7) | శ్రీ వాల్మీకి రామాయణము మొదటి సంపుటము | రు. | 30_00 |

కృతికర్త : ప్రకాశకుడు :

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

8-22-14, గాంధీనగర్, కాకినాడ-4.

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకు ప్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలఁదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతో పాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతలకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామ శాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.